# మాస్టర్జీ

(నాటకం)

# బెల్లంకొండ రామదాసు

జయంతి పబ్లికేషన్స్,
గోపాలరెడ్డిరోడ్డు :: విజయవాడ-2.



*23-08-1923 -------------- 19-09-1969.*

*Sri BELLAMKONDA RAMA DASU GARU.*

# పాత్రలు

రజని : [మాస్టర్జీ] 30 సం. వయస్సు. గౌరవ కుటుంబంలో పుట్టాడు. సమాజంలోని అన్ని దురభ్యాసాలకు లోనైనాడు. తన కుటుంబానికి జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకుంటాడు.

శేఖర్ : [కవి] వయస్సు 28 సం. భాగ్యవంతుల కుటుంబంలో పుట్టి దరిద్రుడై కవిగా జీవిస్తూవుంటాడు. అధర్మాన్ని సహించడు.

మార్వాడీ : వయస్సు 50 సం. లోభి, దురాశపరుడు. డబ్బే ప్రధానంగా జీవించేవాడు. నమ్మినవాళ్ళనుమోసగించే స్వభావం.

భీముడు : వయస్సు 35 సం. కాడీ. మాస్టర్జీ నమ్మినబంటు. మార్వాడీకి శత్రువు.

జంతర్ : } వయస్సు 30 సం. జేబుదొంగలు.
మంతర్ : } జీవనంకోసం మాస్టర్జీని ఆశ్రయించినవారు.

పెద్దమనిషి : వయస్సు 40 సం. ప్రాక్టీసులేని ప్లీడరు.

గుమాస్తా : వయస్సు 50 సం. చాలాకాలంనుంచి మార్వాడీ వద్ద గుమాస్తా.

సబ్ ఇనస్పెక్టరు : వయస్సు 35 సం.

శారద : వయస్సు 25 సం. శేఖర్ [కవి] భార్య.

బాబు : వయస్సు 10 సం. శేఖర్ కొడుకు.

కానిస్టేబుల్ : వయస్సు 30 సం.

ఈ నాటకం మొదటిసారిగా ఆలిండియా రేడియో హైదరాబాద్ కేంద్రంనుంచి, తరువాత విజయవాడ కేంద్రం నుంచి ప్రసారం చేయబడింది.

హైద్రాబాద్ కేంద్రంనుంచి బ్రాడ్‌కాస్టు చేయబడినప్పుడు నేషనల్ థియేటర్సు హైద్రాబాద్‌వారు, విజయవాడ కేంద్రంనుంచి బ్రాడ్‌కాస్టు చేయబడినప్పుడు ర. స. న. సమాఖ్య విజయవాడవారు ప్రదర్శించారు.

1953 డిశంబర్‌లో ఆంధ్రవిశ్వవిద్యాలయాల [వాల్టేర్] నాటకాల పోటీలో సి. హెచ్. శ్రీరాములు [మాస్టర్జీ పాత్రధారి] ఉత్తమనటుడుగా బహూకరింపబడ్డాడు.

1954 విజయనగరం కళాప్రపూర్ణ బళ్లారి టి. రాఘవాచార్యులుగారి స్మారకదినోత్సవముల ప్రదర్శనలో ఈ నాటకానికి ప్రదర్శనకు ద్వితీయ బహుమతి, కె. వెంకటేశ్వరరావు ఉత్తమ నటుడుగాను బహూకరింపబడ్డారు.

నా టి న ట వ ర్గ ం

రజని : సి. హెచ్. శ్రీరాములు
శేఖర్ : కె. వెంకటేశ్వరరావు
మార్వాడి : ఎ. రామచంద్రరావు
భీముడు : సుబ్బారావు
జంతర్ : చలపతిరావు
మంతర్ : ప్రసాద్
ఇనస్పెక్టరు : రఘురామారావు
గుమాస్తా : } కృష్ణమూర్తి
పెద్దమనిషి : }
బాబు : సూర్యనారాయణ
శారద : ఉషాబాల
కానిస్టేబుల్ : సుబ్బారావు

దర్శకత్వం : కె. వెంకటేశ్వరరావు

ప్రదర్శన హక్కులు ర. స. న. సమాఖ్య విజయవాడవారివి.

# మొదటి రంగం

[ఒక పెద్ద సత్రంలాంటి ఇంటిలో ఒకమూల ఒక చిన్న భాగం. అది శేఖర్ ఇల్లు. ఇంట్లో ఆట్టే వస్తువులేమీ ఉండవు. ఒకటి రెండు కుర్చీలు, ఒక పాతబడిన ఈజీఛైర్, ఒక నులక మంచం, చెదురుగా పడేసివున్న పుస్తకాలు, గుడ్డలు, తెర ఎత్తేసరికి శేఖర్ భార్య శారద, కొడుకు బాబుకు బట్టలు తొడిగి క్రాఫు దువ్వుతూ ఉంటుంది.]

బాబు : అమ్మా మరే, నాకో చిన్న సందేహం వచ్చిందే.

శారద : ఏమిట్రా అస్తమానం సందేహాలు. నీ సందేహాలూ, మీ నాన్న సందేహాలు తీర్చలేక నా దుంప తెగుతోంది.

బాబు : పోనీలేవే. అన్నిటికీ విసుక్కుంటావు. (దువ్వించుకోకుండా వెళ్ళిపోబోతాడు.)

శారద : ఉండరా, దువ్వించుకొని పోదువుగాని.

బాబు : మరి నా సందేహం తీరుస్తావా ?

శారద : ఏమిట్రా నీ సందేహం ?

బాబు : మరి, నీవు పెద్దా? నాన్న పెద్దా?

శారద : ఏమిట్రా ఆ వెధవ ప్రశ్నలు?

బాబు : మరే, మరే, నాకు రాత్రి ఒక పెద్ద కలొచ్చింది. కలంటే చిన్న కల కాదేవ్, పెద్ద కల. ఆ కలలో నీవు ఇంత పొడుగున, అంత లావున, ఒక పెద్ద భూతంలా ఉన్నావు. నాన్న చిన్న మరుగుజ్జుపిల్లాడిలావున్నాడు. నీవు నాన్నను, "నేను బూచిని పట్టుకుంటా పట్టుకుంటా" అని తరుముతున్నావు. నాన్న "నేనే, నీ మొగుణ్ణి నన్ను పట్టుకుంటావంటే" అని ఏడుస్తున్నాడు. అప్పుడు నేను విష్ణుమూర్తిలా ప్రత్యక్షమై చేతులో పలకతీసి నీమీద విసిరికొట్టేసరికి నీతల తెగి నీవు మళా అమ్మవై పోయి నన్ను కావలించుకుని ...

శారద : ఏడిశావ్, విష్ణుమూర్తి చేతిలో పలక ఉంటుందట్రా?

బాబు : నేను కొత్తరకం విష్ణుమూర్తినిలేవే. అయినా కల కాదుటే ?

శారద : మీ కలలకు ఒక అర్థం పర్థం లేదు. మీ నాన్నా అంతే: నీకు రాత్రిళ్ళు కలలొస్తే ఆయనకు పగలే కలలొస్తాయి.

బాబు : ఇహ నేను వెడతా త్వరగా దువ్వేసేయి.

శారద : కాసేపు చదువుకోరాదుట్రా. మీ నాన్నకూడా వచ్చే వేళైంది. వస్తున్నారేమో చూడు.

బాబు : అప్పుడే వస్తాడూ? నీ వంటే భయంకదూ......

శారద : నోరుముయ్.

(కొట్టబోతుంది. బాబు తలుపు దగ్గరికి పరుగెత్తాడు. వీధిలోకి వెళ్ళి పరుగెడుతూ తిరిగి వస్తాడు.)

బాబు : అమ్మా! నాన్న వస్తున్నాడే. నాన్న - ఒక పెద్ద ఆఫీసరూ కలసి వస్తున్నారే.

(శేఖర్ ముందు ప్రవేశిస్తాడు. తరవాత రజనీ, శేఖర్ దీనంగా చెదిరిపోయి ఉంటాడు. పైజమా, లాల్చీ. రజని ఠీవిగా ఉంటాడు. సూట్‌వేసుకుని ఉంటాడు. చేతిలో సిగరెట్ టిన్ వుంటుంది.)

శేఖర్ : (ప్రవేశిస్తూ) కమిన్ మిస్టర్ రజనీ. (శారదవంక తిరిగి) శారదా, కొంచెం మంచినీళ్ళు పంపించు.

(శారద లోపలికి వెళుతుంది. బాబుకూడా.)

శేఖర్ : కూర్చోండి మిస్టర్ రజనీ (కుర్చీ జరుపుతాడు.)

రజని : (కూచుని) థాంక్యు !

(బాబు గ్లాసుతో నీళ్ళు తెచ్చి రజని కిస్తాడు.
రజని బాబుని దగ్గరికి తీసుకుంటాడు.)

రజని : వీడు మీ కుర్రాడు కదూ. ఫైన్, నైస్‌బాయ్, (బాబుతో) ఏం చదువుతున్నావోయ్.

బాబు : థర్డుఫారం.

రజని : ఏ స్కూల్లో ?

బాబు : వెంకయ్య మెమోరియల్ స్కూల్.

రజని : ఓ ఐసీ? మీ పంతులు పేరేమిటోయ్?

బాబు : ఏ పంతులండీ?

రజని : అసలు పంతులు. అంటే హెడ్‌మాస్టర్.

బాబు : రామయ్య.

రజని : ఏ రామయ్యా?

బాబు : వెంకటరామయ్య.

రజని : ఓ వాడా? నాతో చదువుకున్నాడులే. "నీవు బ్రతక లేక, బడిపంతులు వవుతావురా" అంటుండేవాణ్ని. అలాగే అయ్యాడన్నమాట! ఊ సరే. వెళ్ళిచదువుకో. (బాబుకు చాక్లెట్ ఇస్తాడు బాబు లోపలికి వెడతాడు)

శేఖర్ : (కొడుకుని ఉద్దేశించి) వట్టి మొండివెధవసార్. నేను లేకపోతే వాళ్ళమ్మను ఒకటే ప్రాణం తీసేస్తాడు. చదువబ్బేట్టు లేదు.

రజని : చదువుకున్న మనం ఏం ఉధ్దరించి చస్తున్నాం. వాడు చదివి ఉధ్దరించడానికి. చదువుకోకుండా తిరిగితే ఢక్కా ముక్కీలు తిని, అట్లీస్ట ఒకనాటికి కాకపోతే ఒకనాటి కైనా లీడర్ కావచ్చు.

శేఖర్ : (చిరునవ్వు నవ్వి) చాలా దూరం నడిపించాను. ఎక్స్యూజ్ మి.

రజని : ఓ, నో, డోంట్‌వరీ. ఇల్లు దూరంలో ఉండటం ఎందు కైనామంచిది. లోకంలో ఎడ్రస్‌లు మనకు తెలుస్తాయి కాని మన ఎడ్రస్ లోకానికి తెలీదు. అదీకాక, ఫర్ ఫ్రంది మాడింగ్ క్రౌడ్సు అన్నారు. వెనుకటికి నీలాగే నాకో ఫ్రెండుండేవాడు. వాడూ కవి నీలాగే. అందులో ప్రేమకవి. ఒకరోజు మాటల సందర్భంలో 'థియరీలో ప్రేమ ఏమిట్రాశిఖలేజాఉంటే ప్రాక్టీసులో పెట్టాలి' అన్నా. ఆ సాయంత్రం సరాసరి వెళ్ళి ఒక గరల్‌ని లవ్ చేసేశాడు. ఆ మర్నాటినుంచీ మూడురోజులు వాడు అన్నం, తింటేబట్టు. స్నానం, పానం, అన్నం, నీళ్ళు అన్నీ మానేసి తపస్సు చేస్తూ

కూచునేవాడు "ఏమిట్రా నీ గొడవం"టే. 'ఏముంది బ్రదర్, నీ మాట ప్రకారం ప్రేమించాను. దెబ్బ తిన్నాను' అన్నాడు. 'ఎవరినిరా?' అన్నా. ఎవరో గరల్ పేరు చెప్పాడు. 'ఎలా ప్రేమించావురా?' అన్నా. వెళ్ళాట్ట. యుద్ధంలోకి వెడుతున్నట్టుందట. ఆ అమ్మాయిని చూసేసరికి నోటిమాటరాలేదట. గుండె హైస్పీడు ఎత్తుకుందట. నరాల్లో నెత్తురు నీళ్ళక్రింద మారిందట. వీడేదో అనబోతే ఆ అమ్మాయి షెటప్ అని విసురుగా వెళ్ళిపోయిందట. అప్పుడు వాడికి అసలు టెక్నిక్ చెప్పాను. మూడురాత్రులు ట్రయినింగిచ్చి పంపించా. మనం మెత్తబడితే ఆడది గట్టిపడుతుందిరా, 'మనం గట్టిపడితే ఆడదిమెత్తపడుతుందిరా' అన్నా. ఈఫార్ములా ప్రాక్టీసులోపెట్టి, ఆ అమ్మాయినే వివాహం చేసుకుని, కవిత్వం మానేసి, ఇప్పుడు పిల్లల్నికని మన దేశంలోని దౌర్భాగ్యుల సంఖ్య హెచ్చిస్తున్నాడు. అదీ బ్రదర్ టెక్నిక్. కాబట్టి ఇల్లు దూరమనీ దగ్గరనీ వరీ కాకు.

శేఖర్ : ఈ కొంపదొరికేసరికి తల ప్రాణం తోక్కొచ్చింది. నెలగోజులు కాళ్ళరిగిపోయేట్టు తిరిగాను రజని. చివరకు ఈ ఊరిబైట ఈకొంప దొరికింది. దీనికి పాతికరూపాయలు అద్దె. ఇప్పటికి ఐదునెలలనుంచి బాకీ. అందుకనే పగలు ఊళ్ళో రాత్రి యింట్లో గడుపుతున్నాను. ఏదో పూర్ మాన్సుహకాన్, మీరెప్పుడూ ఇలాంటి ఇల్లు చూచి ఉండరు.

రజని : ఓహ్ నో, డోంట్ వరీ. మనం చిన్నతనంలో ఇంత కంటే వరస్టుహౌసెస్‌లో ఉన్నాం బ్రదర్, సూర్యుడూ, చంద్రుడూ మన ఇంట్లోనే ఉండేవాళ్ళు—కొంటెనెంట్లలా టెన్ ఇయర్స్ బ్యాక్ ఒక గాలివానవచ్చింది చూచావ్. అప్పుడు పెద్దపెద్ద భవంతులన్నీ పెళపెళా విరిగిపడ్డాయి. మా యిల్లు మాత్రం అలాగేవుంది. గాలి వానకు ముందు పడిపోకుండా ఉండిచస్తేగదోయి. గాలివాన తరువాత పడిపోవడానికి? కొన్నాళ్ళు అలాంటి హౌసెస్‌లో ఉన్నా. కొన్నాళ్ళు కలకత్తా, బొంబాయి, ఢిల్లీలాంటి నగరాల్లో ఆకాశమంటే పెద్దపెద్ద భవనాల చిట్టచివరి అంతస్థుల్లో అప్సరసల్లాంటి అమ్మాయిలతో బాల్ డాన్సుల్లో మునిగి తేలాను బ్రదర్, నన్నొకమాట చెప్పమంటావ్ ఒకరోజు గుడిసెలో ఉంటాం. మరో రోజు మేడలో ఉంటాం. లైఫ్ చూశావ్, అది మనల్ని లాగాల్సిందేకాని మనం దాన్ని లాగలేమోయ్.

శేఖర్ : నిజంగా మిస్టర్ రజనీ, మీఫుష్ చూస్తే నాకు ఆశ్చర్యమేస్తుంది. మీరేమన్నాసరే నాలాటివాడు అసలు పుట్టగూడదు. ప్రపంచంలో క్రిమిగా కీటకంగా నైనా పుట్టొచ్చుగాని కవిగా పుట్టగూడదు. కవి దేనికి పనికొస్తాడు చెప్పండి. ఏదో ఊహించడానికి — తోచి నప్పుడు — అదీ ఓపిక ఉంటే ఏదో రాయడానికీ తప్ప. లాభంలేదు మిస్టర్ రజనీ. ఆరోజు చూశారు కదూ. బజార్లో ఆ అప్పులవాడు కనిపించాడే. నిజంగా

నా ప్రాణం పైది పైనే పోయింది. మీరు రుండబట్టి సరిపోయిందికాని.

రజని : మైడియర్ బ్రదర్, నీవు ఐదురూపాయ లప్పులవాడికే అంత వణికిపోయావే. దేశం మొత్తంమీద నే నెంత అప్పున్నానో నీకు తెలుసా ?

శేఖర్ : మీకూ అప్పులున్నాయా?

రజని : అదేంటి? లక్షలున్నాయి. యావద్భారతదేశం మన అప్పులతోనే అలమటించిపోతోంది. ఢిల్లీనుంచి రామే శ్వరం వరకూ అయ్యగారు అప్పుచెయ్యని చోటూ, అప్పుతీర్చిన చోటూ లేదు. అప్పు చెయ్యడంలో అవి తీర్చకుండా అలాగే నిలిచిఉంచడంలో మనకు డాక్టరేట్ ఇవ్వాలోయ్. నన్నొక సీక్రెట్ చెప్పమంటావ్. అప్పులవాడు కనిపిస్తే నీకు భయం కలిగిందా? నాకు అపరిమితమైన ఆనందం కలుగుతుంది. మనతో అవ సరమున్న బడుద్ధాయిలు ఇంతమంది ఉన్నారు కదా అని. వాళ్ళు మొహాలు వేలేసుకుని, మన ముందు నిల్చుని, 'అయ్యగారూ ఎప్పుడు పంపిస్తారు?' అని ప్రార్థిస్తుంటే 'పంపుతాం లేవోయ్' అని మనం అంటుంటే ఎంత గ్రాండ్‌గా ఉంటుంది చూడు.

శేఖర్ : అప్పులవాడు ఊరుకుంటాడండి?

రజని : ఎవడికోసం? మన అవసరం తీరింది. ఇహ ఉన్నది వాడి అవసరం. ఊరుకోక ఏం చేస్తాడేమిటి? ఉరిపోసు కుంటాడా? అసలు అప్పులవాణ్ణి ఐసల్లే కూల్ చేసే పద్ధతి మనం కనిపెట్టాం. బజార్లో పోతుంటాడనుకో,

మన అదృష్టవశాత్తూ వాడు తటస్థిస్తాడనుకో. అసలు నెం. 1. హాల్ చూసీ చూడనట్టు వెళ్ళాలి. చూచి వాడే పిలిస్తే నెం. 2. "ఓహ్" ఒక చిన్న చిరు నవ్వు వాడి మొహాన పారేసి, 'ఏమయ్యా, అంతా బాగు న్నారా? భార్యాబిడ్డలు కులాసాగా వున్నారా? బిజి నెస్ బాగా సాగుతుందా? పాపం చాల చిక్కినట్టు న్నావ్. చిక్కుల్లో పడ్డావా?' ఏవో ఇలాంటి ప్రశ్న లతో వాడి క్షేమ సమాచారములు విచారించి, వాడికి మనమే ఆప్తబంధువులమైనట్టు ఒక చిన్న సీన్ ఆడె య్యాలి. దాంతో వాడి జ్వరం నార్మల్‌కు వచ్చి అసలీ అప్పుల సంగతి తీసుకురాడు. ఒకవేళ మన అదృష్టవశాత్తు తీసుకవస్తే 'నేనూ చూచావ్, ఇటీవల చాలా చిక్కుల్లో ఇరుక్కున్నాను. మీ౧ది సర్దే ప్రయ త్నంలోనే ఉన్నాను. ఏమిటో అన్నీ ఎదురు తిరుగు తున్నాయండీ' అని. నెం. 3. మనం కాస్త తగ్గాలి. దాంతో వాడు మరీ తగ్గుతాడు. ఇద్దరం తగ్గి ఒకరు ఉత్తరానికీ, ఒకరు దక్షిణానికి వెళ్ళిపోవాలి. చరిత్రలో మన పేరు సువర్ణాక్షరాలతో లిఖింపబడకపోయినా వాడి ఖాతా పుస్తకాల్లో తరతరాలు ఉంటుంది. తీరిస్తే మట్టుకు మన అప్పులు తీరుతాయా బ్రదర్. మన అప్పులవాళ్ళ లిస్టు తయారు చెయ్యటానికి స్పెషల్‌గా ఒక సెన్సెస్ శాఖ స్థాపించాల్సి ఉంటుంది. సరే కాని మనకు కొంచెం డోస్ పడాలోయ్. మీ౧ వాడిచేత కాస్త కాఫీ తెప్పించు.

శేఖర్ : ఒరేయ్ నాన్నా, అమ్మనడిగి కాస్త కాఫీ పట్రారా

(బాబు ప్రవేశిస్తాడు)

బాబు : కాఫీనా నాన్నా?

శేఖర్ : వెళ్ళరా.

బాబు : కాఫీ ఉందికాని పాలులేవు నాన్నా.

శేఖర్ : ఫూల్, పాలు పోయించుకోలా.

బాబు : పాలున్నాయికాని పంచదారలేదు నాన్నా.

శేఖర్ : ఇడియట్. పంచదార పట్రాపో.

బాబు : పంచదార పాలూ ఉన్నాయికాని అసలు కాఫీపొడి లేదునాన్నా.

శేఖర్ : వెధవ, ఏమిట్రా. (బిగ్గరగా) శారదా, శారదా, కాస్త కాఫీ పంపించు.

(బాబు లోనికి వెడతాడు)

రజని : (శేఖరుతో) చూశావా మీవాడు? నీకూ వాడికీ ఎంతభేదం ఉందో. నీవు కవివైనావు కాని వాడు నెపోలియన్ లా ఏ డిక్టేటరో అవుతాడు. నేను మొహం చూడగానే చెప్పేస్తానోయ్. ఫేస్ రీడింగ్ కూడా స్టడీ చేశా. మీవాడి మొహంలో రాజకళ రాసి ఉంది.

(బాబు ఫ్లాస్క్ తీసుకొని వస్తాడు)

శేఖర్ : ఎక్కడికిరా?

బాబు : హోటల్ కు వెళ్ళి తెస్తాను నాన్నా!

శేఖర్ : డబ్బులున్నాయా?

బాబు : ఓ.

రజని : డోంట్ వరీ, ఐ షెల్ పే.

శేఖర్ : నో. నో. ఉన్నాయిలెండి వాడిదగ్గర.

రజని : మనకంటె కాస్త కాపిటలిస్టే నన్నమాట. (బాబుతో) ఒరేయ్ బాబూ ఆ వీధి మలుపులో కృష్ణయ్యర్ హోటల్ కెళ్ళి, "మాస్టర్జీ" అడిగారని పది స్వీట్లు, పది హాట్లు, కాఫీ పట్రా. ఉండు చీటీయిస్తాను. (చీటీ రాశిస్తాడు)

శేఖర్ : ఎందుకులెండి.

రజని : ఒహ్. నో. డోంట్‌వరీ. తినాలి, తాగాలి. అప్పుడు గాని ప్లాన్లు తట్టవు బ్రదర్.

(బాబు వెడతాడు)

రజని : (శేఖర్‌తో) ఏమిటోయ్ అలా విచారంగా ఉన్నావ్?

శేఖర్ : ఏం లేదు రజని. మీకు నా మీద ఇంత దయ చూపడం......

రజని : ఒహ్ నో డోంట్ వరీ, ఒకరి కొకరు సహాయ పడక పోతే ఎలాగోయ్? ఇందాక ఏమిటి చెబుతున్నాను?

శేఖర్ : ఏదో ఫేస్ రీడింగ్ సంగతి చెబుతున్నారు.

రజని : ఆ. అదె. ఫేస్‌రీడింగ్‌కూడా స్టడీ చేశా, కానిఆరీడింగు ఈ రోజుల్లో తప్పుతోంది. ఫేస్ ఈజ్ ది ఇండెక్స్ ఆఫ్ క్యారెక్టర్ అన్నారుకదూ. పూర్వం ఇది కరెక్టయి ఉండొచ్చు. కాని ఈరోజుల్లో వట్టి వెధవకు ఫైన్‌ఫేస్ ఉంటోంది. అయినా నా రీడింగ్ తప్పదులే. మొదట మనం హోటల్లో కలిశాం చూశావ్, నిన్ను చూడగానే అనుకున్నాను. "గొప్పఇంటిబిడ్డ బతికిచెడ్డట్టున్నా"డని. నీవు జనాన్ని చూచి చూడనట్టు ఏదో ఒకలా ఉన్నావ్.

సంఘం వుంది చూశావు బ్రదర్. అది చితికినవాణ్ణే చితగ్గొడుతుంది. దాంతో కుస్తీపట్లు పట్టాలంటేవాడు, పెద్ద ఛాంపియన్ అయిఉండాలి. ఎప్పుడూ మనం చిత్తు కాకుండా ఉండాలి బ్రదర్. చెపుతాలే ఆ టెక్నిక్ అంతా. (బాబు వస్తాడు)

రజని : (బాబుతో) ఇచ్చాట్రోయ్?

బాబు : ఓ 'మాస్టర్జీ' తెమ్మన్నారు అనగానే హడలిపోయి, అసలు మేనేజరే అన్ని పొట్లాలు కట్టి ఇచ్చాడు.

రజని : హడలిపోయాడన్నమాట!

బాబు : హడలిపోవడ మేమిటి? డి.ఇ.ఒ. వస్తున్నాడంటేమా మాస్టర్లుకూడా అలా హడలిపోరు.

రజని : రైట్. నీవు జీనియస్ వురా. నాదగ్గర శిష్యుడుగా ఉండ రాదూ, నిన్ను మంత్రిని చేస్తాను.

బాబు : ఆ పని నాకొద్దులెండి. మంత్రి కావడంకన్న మన్ను కావడం నయమని మా నాన్న చెప్పాడు.

రజని : ఏం?

బాబు : మంత్రి ఐనప్పటినుంచి, ఎప్పుడు ఊడగొడతారా అని భయమట.

రజని : నీకూ పాలిటిక్స్ తెలుసే. ఫైన్. వెళ్ళి మిఠాయి తిని చదువు మానేసి షికారు చేసిరా. పో.

(బాబు వెడతాడు)

రజని : ఏమిటో అనుకున్నాను. మీవాడు నిజంగా మంత్రి పదవి చేసేట్టున్నాడేమోయ్.

శేఖర్ : వాడి మొహం. మొండివెధవ. (బాబు కాఫీ తెస్తాడు)

రజని : (కాఫీ త్రాగి) ఫైన్, బాగానే చేశాడు.

శేఖర్ : నైస్.

రజని : (బాబుతో) నీవు తీసుకున్నావా?

బాబు : ఓ. మా అమ్మకూ నాకూ రిజర్వు చేశా. (లోనికి వెడతాడు)

రజని : (శేఖర్‌తో) ఒక విధంగా నీది మంచి లైఫేనోయ్. ప్రాపర్టీ ఉందనుకో. అయినా భార్యాబిడ్డలూ...

శేఖర్ : మీ ఫామలీ ఎక్కడుంది మిష్టర్ రజనీ?

రజని : మనకు ఫామిలీ ఏమిటి? ప్రతి ఊరూ మనకు అత్తగారి ఊరే. అసలు నాకు ఈ వివాహంలో విశ్వాసం లేదోయ్. ఎవతెనో ఒక దాన్ని కట్టుకోవడం మనం దాన్ని వదిలించుకోలేక, అది మనల్ని వదలించుకో లేక లైఫంతా పీక్కోడం. దాంతోనే పిల్లల్ని కనడం వాళ్ళను పోషించుకోలేక పోవటం పెళ్ళాంమీదకోపం సంఘంమ్మీద, సంఘంమీద కోపం పెళ్ళాంమీద చూపించడం ఈ గొడవంటే నాకు చెడ్డ అసహ్యం. మనం పుట్టి ఈ అద్వాన్నపు ఏడుపు ఏడుస్తున్నది చాలక మనంకూడా మరొకరిని పుట్టించి ఏడిపించక పోతేనేం?యువిల్‌హ్యావ్ నోమారేజెస్,అన్నాడోయ్ హామ్లెట్. అందుకనే మ్యారేజ్ మానేశాను.

అంత మాత్రంతో ఆడదాని సంగతి నాకు తెలీ దనుకోకు. నీకు నీవైఫ్ సంగతే తెలుసు. నాకు చాల మంది వైఫుల సంగతి తెలుసు.

మరిచాను. ఇంతకూ నీ వైఫ్‌ని ఇంటర్‌డ్యూస్ చెయ్య లేదేమిటోయ్.

శేఖర్ : సారీ. శారదా ఒకసారి యిలా రా. (శారదవస్తుంది)

శేఖర్ : వీరు మిస్టరు రజని, నాకు చాలా ఆప్తమిత్రులు. ఇటీవలనే పరిచయమైంది. మన కుటుంబమంటే వీరి కెంతో అభిమానం. ఎన్నిసార్లు అడగ్గా అడగ్గా ఇవాళ మనింటికి వచ్చారు. చాలా గొప్ప బిజినెస్ చేస్తున్నారు. మా నాన్నగారికీ వీరి నాన్నగారికికూడ బాగా స్నేహమట. మన సంగతంతా వారు చెబుతూ ఉండేవారు.

శారద : నమస్కారమండి.

రజని : నమస్కారమమ్మా. చాలారోజులనుంచీ మీఇంటికి వద్దామనుకొంటున్నాను. కాని వీలుపడలేదు. ఈ బిజ నెస్ నా ప్రాణం తినేస్తుంది. మీ మామగారిదీ, మీ కుటుంబంసంగతి నా కంతా తెలుసమ్మా. బ్రతికి చెడ్డవాళ్ళు అసలు బ్రతికకూడదమ్మా. శేఖరుకూడా నాకు అన్ని విషయాలు చెప్పాడు. ఏమీ దిగులు పెట్టుకోకండి. నేనూ మీ ఆయనా ఒక పెద్ద ప్లాన్ వేశాం. మనకు మంచిరోజులు ఈరోజే ప్రారంభించా యనుకోండి.

శారద : మీ స్నేహితుణ్ణి మీ రెలాగయినా... ...

రజని : మీరు చెప్పాలమ్మా నాకు తెలీదూ ? ఒకటేమాట చెబుతున్నా. ఒక్క నెల ఓపికపట్టండి. నిన్ననే నేను వచ్చాను. ఒక నెలలోగా ప్లాన్‌లన్నీ పూర్తి

అవుతాయి. ఒక కారు, ఒక బంగళా, బంట్రోతులు ఆయా బ్యాంకులో కాష్, చూడండి నామాట. అబద్ధమైతే ఈ రివాల్వరుతో మీ స్వంతచేతులతో నన్ను కాల్చేయండి. (రివాల్వరు చూపుతాడు)

శారద : (భయంతో) ఓ.

శేఖర్ : నీకు తెలీదు శారదా. రజని మాటంటే మాటే.

శారద : ఏమోనండి, నాకు భయంగా ఉంది. అంత భాగ్యం మనం...

శేఖర్ : నీకు భాగ్యం అలవాటులేదు. అందుకనే భాగ్యం అంటే నీకు భయం. నేను బంగారపు ఉయ్యాలలో ఊగాను. భవనాల్లో పెరిగాను. నర్సు పాటపాడితే కాని నాకు నిద్రవచ్చేది కాదు. ఇప్పుడూ, చుట్టూ లారీలూ బస్సులూ తిరుగుతున్నా నిద్రవస్తోంది. కర్మ.

శారద : పోనీండి. అన్నిటికీ నన్నే నిందిస్తారు. మీ దరిద్రానికి నేనే కారణ మంటారు!

శేఖర్ : ఔను, నీవు అడుగు పెట్టినప్పటినుంచే...

రజని : ఎందుకోయ్ ఆమె నంటావ్. ఎవరి కర్మకు ఎవరు బాధ్యులు బ్రదర్. రేపు కలిసొస్తే మళ్ళీ ఆమెవల్లనే వచ్చిందనుకుంటావ్. ఇదంతా మనం అనుకోడంలో ఉంటుంది. (శారదతో) నీవు వెళ్ళమ్మా. కవుల మాటలు పట్టించుకోకు. వాళ్ళు పుస్తకాలలో ఎలా రాస్తారో పెళ్ళాలతోకూడా అలాగే మాట్లాడుతారు.

(శారద లోనికి పోతుంది)

శేఖర్ : అన్నిటికీ అనుమానాలే మిస్టర్ రజని.

రజని : ఆడవాళ్ళంతే బ్రదర్. కూరగాయల్ని వేరినట్టే మనల్ని గూడా ఏరేస్తారు. వాళ్ళ మాటలు మనం పట్టించు కున్నట్లు నటించాలి. కాని అసలు పట్టించుకుంటే అడుగుతీసి అడుగు పెట్టలేం. కమింగ్ టు ది పాయింట్. ఇంతకూ నీవు రెడీగా ఉన్నావా ?

శేఖర్ : దేనికి ?

రజని : మళ్ళీ మొదటికొచ్చావ్. అదేనోయ్ మనం క్లబ్‌లో డిస్కస్ చెయ్యాలా ?

శేఖర్ : ఏమో మిస్టర్ రజని. నా భార్యను కోప్పడ్డాను. కాని నాకూ కొంచెం భయంగానే ఉంది.

రజని : అదుగో, నాకు తెలుసు. మీ కవులున్నారే కవిత్వం రాయడానికీ, కందిపచ్చడి తినడానికీతప్ప మరెందుకూ పనికిరారు. బ్రదర్ ఇది వరల్డ్ బ్రదర్. మనం బ్రతుకు తున్నది కావ్యాల్లో కాదు. మట్టిమీద బ్రతుకు తున్నాం. మనం ఒక్కళ్ళమే బ్రతకడంలేదు. మన చుట్టూ మనలాటి వాళ్ళే మనుష్యులున్నారు. వీళ్ళం దరూ ఒక రకంగా వుండరు బ్రదర్. ఇది ఒక పెద్ద చిక్కు గ్రాఫ్. కడుపు కాలుతూ ఉంటే కలలూ కవిత్వమేమిటోయ్. భూమి సూర్యుడిచుట్టు కాదు బ్రదర్ తిరుగుతున్నది. రూపాయచుట్టూ. ముందు ఆ రూపాయి సంపాదించి, తర్వాత నీ యిష్టం వచ్చినన్ని కలలు కను. కవిత్వాలు రాయి. టాగూరల్లే నోబుల్ ప్రైజు కొట్టు. భజన చేయించుకో.

శేఖర్ : నిజమే రజని నీవు చెప్పేది. కాని ఆ డబ్బెలా సంపాదించగలం చెప్పు.

రజని : అదే నా పాయింట్. నీవు ఉద్యోగం చెయ్యలేవు. ఎక్కడనో ఒకచోట తలవంచి రాత్రింబగళ్ళు అయినవీ కానివీ లెక్కలురాసి నాలుగురాళ్ళు తెచ్చుకొని పట్టెడు కూడు తిని పడివుండటం నీకు చాతకాదు. పెద్ద పర్వత శిఖరంమీదనుంచి హఠాత్తుగా లోయలో పడ్డావ్. అందుకనే ఈ ప్లాన్ ఆలోచించాను.

శేఖర్ : ఏదో శాంతంగా కాలం గడుపుతూ ఏదైనా ఆలోచించి ఉత్తమగ్రంథాలు వ్రాస్తూ జీవిద్దామనుకున్నాను కాని...

రజని : బ్రదర్. కవిత్వం కూడుపెడుతుందా చెప్పు. అదీ ఒక వ్యసనం. అందులో నీకవిత్వం నీకే అర్థంగాదు. ఈ జనంలో ఎలాగోయ్ ప్రచారమవుతుంది. కవిత్వం కూడా బిజినెస్ బ్రదర్. దానికీ మార్కెట్ వాల్యూ అంటూ వుంది. కాబట్టి మనప్లాన్ ఒ. కే. అవుతే నీ యిష్టం వచ్చినన్ని ఉత్తమగ్రంథాలు వ్రాసి లోకోద్ధరణ చెయ్యి. కవిత్వాన్ని వాయిదా వేసి కార్యరంగంలోకి దిగు.

శేఖర్ : సరే మిస్టర్ రజని. అలాగే కానీ.

రజని : స్ట్రైట్‌గా ఉండాలి తెలుసా? మధ్యలో జావకారకూడదు. వేషం మార్చెయ్యాలి వేషాలు వెయ్యాలి. మోసాలు చెయ్యాలి అంటాడు రజని. రెడీనా మరి?

శేఖర్ . రెడీ.

రజని : అంతా సిద్ధంచేశాను తెలుసా?

శేఖర్ : ఊఁ.

రజని : రేపు ఉదయం పదిగంటలకు నన్ను గ్రేట్ ఎవరెస్ట్ క్లబ్బులో కలుసుకో. తరువాత ప్లాన్ తరువాత చెబుతాను.

శేఖర్ : ... ... ... ...

రజని : మరి వస్తాను.

శేఖర్ : ఆల్ రైట్.

రజని : (ఒక వందనోటు ఇచ్చి) ఇది దగ్గరుంచు.

శేఖర్ : ఎందుకు మిస్టర్ రజని.

రజని : ఉంచు. అద్దెబాకీ ఇచ్చెయ్. వారంరోజుల్లో ఇల్లు మార్చేద్దాం.

శేఖర్ : వద్దు మిస్టర్ రజని... మీ డబ్బు అనవసరంగా...

రజని : నాడబ్బు నీ డబ్బు అంటూ లేవు. అంతా మనడబ్బే ఉంచు బ్రదరు. అద్దె బాకీ తీర్చేసి సూట్లు తీసుకో.

శేఖర్ : మరి...

రజని : మరి గిరీ, తరువాత. అన్నిటికీ అనుమానాలేమిటోయ్ హామ్లెట్‌లాగా హావ్ ఇట్ బ్రదర్ (శేఖర్ జేబులో ఉంచుతాడు) రేపు మరిచిపోకుండా కలుసుకో నన్ను. మళ్ళీ ఏదో రాయబోయే కథను గురించి ఆలోచిస్తూ కూచుని...

శేఖర్ : నో. నో. వస్తాను.

రజని : అదీ. అలావుండాలి. డెసిషన్ అన్నారు. ఈ ఇంటి ఓనరు ఎవరోయ్ ?

శేఖర్ : ఎవరో రామానందంగారట. ఆయనదగ్గర గుమాస్తా వచ్చి అద్దె వసూలు చేసుకెడతాడు.

రజని : రామానందంగాడా? వాడింతయిల్లు ఎప్పుడు కట్టాడోయ్? వాడిరికార్డు నాకు బాగా తెలుసులే. లక్ష కొంపలార్పి ఒకకొంప కట్టాడన్నమాట. రాస్కెల్ వాడేనా నిన్ను అద్దెకు డబాయించింది.

శేఖర్ : వాడి గుమాస్తా.

రజని : నేను చెబుతాలే. డోంట్ వరీ. మరి వస్తాను. ఓ కె! (వెడతాడు. శేఖర్ కలవరంతో మంచంమీద కూచుంటాడు)

శేఖర్ : శారదా.

శారద : (ప్రవేశించి) ఏడీ మీ మిత్రుడు. వెళ్ళిపోయాడా? ఎవరండీ ఈ మిత్రుడు? తుఫానులావచ్చి తుఫానులా వెళ్ళాడు.

శేఖర్ : పెద్ద జీనియస్ లే, నీకు తెలీదు.

శారద : రోజుకొక స్నేహితుణ్ణి తెస్తారు. జీనియస్ అంటారు. ఏ 'యస్' ఐనా కాఫీలు పెట్టివ్వలేక నాదుంప తెగుతుంది. ఇంతకూ ఆయన అనేదేమిటి?

శేఖర్ : ఆ... ఏమీ లేదు. నీకెందుకు. మేమేవో అనేక విషయాలు మాట్లాడుకుంటాం. ఆ వివరాలన్నీ నీకు చెబుతూ కూచుంటే ఇహ చచ్చినట్టే.

శారద : పోనీండి. అన్నీ దాస్తారు. నాకేం చెప్పరు. నేనేదైనా దాస్తె మండిపడతారు.

శేఖర్ : నీవు దాచవూ నేనిచ్చిన డబ్బులో చిల్లర మిగిల్చి...
ఊరుకో గొడవ పెట్టక వెళ్ళు.

శారద : మరెందుకు పిల్చారు?

శేఖర్ : పోట్లాటకు పిల్చానా?

శారద : నేనా పోట్లాడింది?

శేఖర్ : నేనా?

శారద : మీరే మొదట నన్ను విసుక్కున్నారు.

శేఖర్ : ఎప్పుడూ ఇంతే నీవు. ఇంట్లో అడుగు పెడతానో లేదో మొదలెడతావు రొద. పాడు రొద. ఎన్నో గొప్ప ఆలోచనలతో వస్తాను. నీ మొహం చూడగానే అన్నీ పోతాయి.

శారద : పోనీండి. అంత అసహ్యమైతే మా పుట్టింటికి పంపించేసి ఒంటరిగా ఉండండి.

శేఖర్ : "భర్త సుకుమారి, గొప్ప కుటుంబంలో పుట్టాడు. పూవులా పెరిగాడు, హఠాత్తుగా దరిద్రంలో పడ్డాడు. ఆదర్శాలు, ఆశయాలు, కలలూ అన్నీ విఫలమైనాయి" అని జాలి లేదు. ఓదార్పటం లేదు. భర్త మనస్సును అర్థంచేసుకోవడం లేదు. ఎప్పుడూ నగలూ, చీరలూ, సినిమాలూ, పేరంటాలూ— ఛీ. పైగా ఈ పరిస్థితిలో నన్ను వదలి ఇంటికి వెడతానంటావా?

శారద : మీరేగా వెళ్ళమన్నారు.

శేఖర్ : (దీనంగా) నన్ను ఒంటరిగా వదలి వెడతావా శారదా.

శారద : నేను వెడతా నన్నానా?

శేఖర్ : వెళ్ళవా?

శారద : నే నెక్కడికి వెడతాను చెప్పండి?

శేఖర్ : శారదా, ఇలా రా.

(శారద దగ్గరకు వస్తుంది)

శేఖర్ : కూర్చో. (శారద కూర్చుంటుంది)

శేఖర్ : నేనంటే నీ కిష్టంలేదు కదూ?

శారద : ఎవరన్నారు?

శేఖర్ : అనాలా ఏమిటి? నీ మొహం చెప్పడంలా.

శారద : అన్నీ మీరే ఊహించుకుని అనవసరంగా బాధ పడతారు.

శేఖర్ : శారదా, మనకు మంచిరోజులు ఉన్నాయంటావా?

శారద : ఏం మంచిరోజులో.

శేఖర్ : అదుగో నే చెప్పలా, ఉన్నాయంటే నీ సొమ్మేం పోయింది.

శేఖర్ : నా మంచిరోజులు నీకుమాత్రం మంచిరోజులుకావూ?

శారద : ఏమో. ఈ దరిద్రంలో నన్ను ప్రేమించినట్టు భాగ్యములో మీరు ప్రేమిస్తారో ప్రేమించరో.

శేఖర్ : పిచ్చిదానా, నేను నీతో చెప్పనుకాని నిజంగా నిన్ను చూస్తే నాకు జాలేస్తుంది. భాగ్యదశలో ఏవో కలలు కంటూ నిన్ను పట్టించుకోలేదు. తరువాత దరిద్రం వచ్చింది. నాకూ నీకూ ఎంతో దూరం ఏర్ప డింది. శారదా నీకు తెలుసుగా. నిజంగా నే నెందుకు పనికి వస్తాను చెప్పు. ఆ భాగ్యంఉంటే అన్ని భారాలూ

నీ మీద వదలి, సుఖంగా శాంతంగా నిర్విచారంగా జీవితం గడిపేవాణ్ణి.

శారద: పోనివ్వండి. గతించినదాన్ని గురించి చింతిస్తూ కూచుంటే ఏం చెయ్యగలం?

శేఖర్ : అబ్బాయేడి?

శారద: నిద్రపోతున్నాడు.

శేఖర్: అన్నం తిన్నాడా?

శారద: ఊఁ.

శేఖర్: శారదా, ఎప్పుడూ నాతో అలా కఠినంగా మాట్లాడుతావేం?

శారద: అదుగో. మళ్ళీ పోట్లాట త్రవ్వకండి.

శేఖర్: ఊహుఁ. చెప్పవ్?

శారద: మెత్తగా మాట్లాడితే మరీ చులకన చేస్తారు.

శేఖర్: పిచ్చిదానా. నీ సేవ మరచిపోతానా? పెద్ద ప్లాన్ వేశాను. మళ్ళీ మనం పూర్వంలాగా–బంగళా, కారు, ఆయా, బంట్రోతులు, నిన్ను అనుక్షణం అమ్మగారూ అని పిల్చే నర్సులూ. శారదా, అప్పుడు నేను నీ గదిలోకి రావాలంటే ముందుగా ఓ నర్సు చేత కబురు పంపాలనుకుంటాను.

శారద: (చేదుగా నవ్వి) అప్పుడు నేను మీకు ఇంటర్వ్యూలివ్వను.

శేఖర్: అప్పుడు నేను నిన్ను డైవోర్సు చేస్తాను. నీవు పశ్చాత్తాపంతో మళ్ళీ నా కాళ్ళమీదపడితే గూర్ఖాచేత వెళ్ళగొట్టిస్తాను.

శారద: ఆ స్తంతా నా పేర ముందే పెట్టించుకుని మిమ్మల్నే వెళ్ళగొడతాను.

శేఖర్: యూ, సిల్లీ గరల్! (అంటూ సమీపించబోతే ఆమె తప్పించుకుంటుంది)

(ఇద్దరూ తెలియకుండా నవ్వుతారు. ఒక్క క్షణం నిశ్శబ్దం)

శేఖర్: ఇంతకూ రాత్రికి బియ్యం ఉన్నాయా?

శారద: ఉండండి చూచి వస్తాను.
(లోనికివెళ్ళి సంచి తీసుకుని వస్తుంది)

శారద: వెళ్ళి తీసుకురండి.

శేఖర్: బియ్యం లేవా?

శారద: లేవు. డబ్బులున్నాయా?

శేఖర్: ఓ. (నూరు రూపాయలనోటు చూపుతాడు)

శారద: ఎక్కడిదండి?

శేఖర్: ఎందుకు నీకా వివరాలన్నీ? మీ నాన్న పంపించా డనుకున్నావా? నానా అగచాట్లుపడి నేనే తెచ్చాను.

శారద: ఊరికినే అడిగాను. నా కెందుకులెండి డబ్బు. మీ ఇష్టం వచ్చినట్లే వాడుకోండి. అన్నీ నాతో సంప్ర తించే చేస్తున్నారా ఏమిటి?

శేఖర్: అదుగో డబ్బు కనిపిస్తేసరి. చికాకు ఎక్కువౌతుంది. వట్టి డబ్బు మనుషులు. ఎప్పుడైనా డబ్బు మొహం చూసి చస్తేగా? పుటకతో రావాలికాని దర్జా నేర్చు కుంటే వస్తుందా?

శారద: డబ్బు మనుషులు కాబట్టే దగ్గర వందలున్నా 'నాకు డబ్బులేదు శారదా, ఐదురూపాయలే ఉన్నాయి. నా సిగరెట్లకూ కాఫీలకూ కావాలి' అని మోసం చేస్తారు.

శేఖర్: నోరుముయ్. నేను డబ్బుమీద నడిచాను. నేను పారేసినంత కూద మీ ఇంట్లో పండుగలకు కూడ వండుకుని ఎరుగరు.

శారద: అలా పారెయ్యబట్టే ఇల్లా తగలడింది.

శేఖర్: శారదా, తలకుమించినమాటలు మాట్లాడకు. కూటికి గుడ్డకు లేనివాళ్ళ పిల్లవై కూడా వెధవ అహంకారం.

శారద: పోనివ్వండి. ఎవరి గొప్పలు వాళ్ళవి. ఎవరి మర్యాదలు వాళ్ళవి. ఎన్ని భరించినా ఇంతే. చూడండి... ఒక్క చీరతో సంవత్సరంనుంచీ... ఇదే ఉతుక్కుని... ఇదే ఆరేసుకుని... ఇదీ పిగిలిపోతోంది. రెండేజాకెట్లు మీకేం మహారాజులా తిరుగుతారు. ఎక్కడికైనా వెళ్లాలంటే నాకు తలతీసినట్టు ఉంటుంది. అబ్బాయికి ఒక్క నిక్కరైనా లేదు.

శేఖర్: విషం తెచ్చిస్తాను. వాడికింతపెట్టి నీవింత తాగు. పీడ వదులుంది. నేను మహారాజులా తిరుగుతున్నానా? ఈలాల్చీతో ఇప్పటికి ఆరు నెలలబట్టి గడుపుతున్నాను. సిల్కు లాల్చీలు తప్ప వేసి ఎరుగను. స్నేహితుల మధ్యకు వెళ్ళాలంటే...

శారద: పోనివ్వండి. వెధవ డబ్బుకోసం పోట్లాట. వెళ్ళి బియ్యం తీసుకురండి.

శేఖర్: ఛీ. రోజూ ఈ బియ్యపు సంచీలు మొయ్యలేక నా దుంప తెగుతోంది. ఇవాల్టికి ఆ పక్కవాళ్ళింట్లో తీసుకుని ఇంత వండి పడెయ్.

శారద: ఔను మహారాజు బిడ్డలు. పాపం, ఏదీ మీ చెయ్యి చూపండి.

శేఖర్: ఏం?

శారద: (అతని చెయ్యి తన చేతిలోకి తీసుకుని) ఎఱ్ఱగులాబి మొగ్గలా ఉంది. పాపం రోజూ ఈ సంచీలు మోసి కాయలు కాసింది. ఒక్కోసారి మిమ్మల్ని చూస్తే నాకు జాలేస్తుంది.

శేఖర్: నిజంగా......

శారద: మీకు నే నెంత చేస్తున్నా నన్ను నమ్మరు.

శేఖర్: శారదా.

శారద: ఊఁ.

శేఖర్: శారదా, బీచ్ కి వెళదామా?

శారద: బీచ్ కా? (చేదుగా నవ్వుతుంది)

శేఖర్: (మత్తుగా) ఊ. మన డ్రైవరిని పిలవనా? మనిద్దరం ఒంటరిగా బీచ్ కి కార్లో వెళ్ళిచాలారోజులైంది. ఇవాళ వెళదాం. ఆ వెన్నెలచూడు ఎలా వుందో. నేను వెన్నె

లను చూచి ఎన్నాళ్ళయింది? మళ్లీ ఇవ్వాళ చూస్తున్నాను శారదా! బీచ్ కి వెళదాం. సముద్రం ఒడ్డున కూచుని నీవు మెల్లని కంఠంతో ఒక చక్కని పాట పాడుతూంటే నీ ఒళ్లో తలవాల్చి నిద్రిస్తూ, ఆ నిద్రలోనే చనిపోతాను.

శారద: ఏమిటండీ, ఆ మాటలు.

(వెలుపల పెద్ద వికటాట్టహాసం వినిపిస్తుంది)

శేఖర్: (ఉలికిపడి) శారదా? ఎవరా నవ్వింది.

శారద: ఎవరో పిచ్చివాడు రోజూ ఇటు అడుక్కోటానికి వస్తుంటాడు వాడై ఉంటాడు.
(లోపలకంఠం) అమ్మా మాదాకబళం తల్లీ! అమ్మా మాదాకబళం తల్లీ! అమ్మా మాదాకబళం తల్లీ.

(మళ్లీ నవ్వు)

శేఖర్: శారదా.

శారద : ఊం.

శేఖర్: శారదా! బ్రతుకు చాలా భయంకరమైంది.

(తెర)

## రెండవ రంగం

(మార్వాడీ సేట్ దుకాణం, పరుపులు, పాందాన్, గుమాస్తా లెక్కల్లో నిమగ్నుడై ఉంటాడు మార్వాడీ కొంచెం గాభరాతో అటూఇటూ తిరుగుతూ ఉంటాడు. ఫోన్ తదితర వస్తువులు, పేపర్లు మొదలైనవి)

మార్వాడీ: అరె పంతుల్ మాది తేల్చావ్. మాదిముంచావ్? పగలు రాస్తావ్. రాత్రీ రాస్తావ్. ఏక్ లెఖ్ఖా తేలదు మాది ప్రాణ్ పైది పైననే ఎగురుతది. క్యా పంతుల్ ?

గుమాస్తా: కొంచెం ఓపికపట్టండి సేట్‌సాబ్, పదినెల్ల దొంగ లెక్కలు పది రోజుల్లో మాఫీ చెయ్యాలంటే మానవ మాత్రుల సాధ్యమా సేట్‌సాబ్?

మార్వాడీ: అరె పంతుల్. మీకీ ఏం? మాటల్ చెబుతావ్. మాకీ పీకలమీదకూచున్నాడ్ మాకీ మొగుడ్. అరె పంతుల్ మాకీ భార్యకీ మేము ఒకడే మొగుడ్. మాకీ ఊరంతా మొగుడ్. ఇంకంటాక్సువాడు మాకీమొగుడ్. సేల్‌టాక్సువాడు మాకీ మొగుడ్. పోలీస్‌వాడు మాకీ మొగుడ్. అరె పంతుల్ ఈ దునియాలో ఒకడికిఒకడు

మొగుడ్. వాడికి వీడూ, వీడికి వాడూ. వాడికి వీడికి వీడూ వాడూ సబ్ దునియాకీ డబ్బా మొగుడ్ పంతుల్. అరె వాడు మాస్టర్జీ వాడు దస్ హజార్ నూకి వెళ్ళిపోయాడ్. ఇంకంటాక్సువాడు ఫీకలపై కూచున్నాడ్. అరె పంతుల్. అరె రాం. రాం. సోడా పంతుల్. ఏక్ సోడా లావ్ పంతుల్. (పరుపుమీద కూలబడిపోతాడు. గుమాస్తా లోపలికి వెళ్ళి ఒక సోడా తెచ్చి కొట్టిస్తాడు. సేట్ నోరు తెరుస్తాడు. గుమాస్తా నోట్లో పోస్తాడు.)

మార్వాడీ: అరె రాం రాం రాం పంతుల్ వాడు మాస్టర్జీ వాడికి ఏక్ టెలిగ్రామ్ లగావ్ పంతుల్.

గుమాస్తా: కొంచెం ఓపికపట్టండి సేట్‌సాబ్.

మార్వాడీ: క్యా ఓపిక పంతుల్. మాకీ బేడీలు తగుల్తాయి! (ఫోను మ్రోగుతుంది మార్వాడీ బెదుర్తాడు) అరె పంతుల్ దేక్ దేక్ పంతుల్. (గుమాస్తా వెళ్లి ఫోను ఎత్తి మాట్లాడుతాడు)

గుమాస్తా: ఓ తమరా ? నమస్తే, ఎప్పుడొచ్చారు? ... ... .. ఓహో... సేట్‌జీనా... ఓ కులాసా... ... ... మీరు ఇంకా రాలేదని కాస్త గాబరాలో ఉన్నారు... ... వస్తున్నారా... ... ... మంచిదండి... ... ... ఓ. ... సెలవు. (ఫోను పెట్టేస్తాడు)

మార్వాడీ: ఏమ్టి పంతుల్ మాకీ మొగుడ్.

గుమాస్తా: మొగుడ్ కాదు సేట్‌సాబ్. మాస్టర్జీ వచ్చాడు. కారులో బయలుదేరి ఇక్కడికి వస్తున్నానని ఫోన్ చేశాడు.

మార్వాడీ: అరె మాస్టర్జీ వచ్చాడ్. అరె జయరాంసీతారాం మాకీ ప్రాణ్ వచ్చిందిపంతుల్. పంతుల్ సబ్ రాం దేవ్ దయ. మాకీ చేతుల్లో ఏముందీ? సబ్ రాం దేవ్ దయ. వాడు సీదా ఉల్టా చేస్తాడ్, ఉల్టా సీదా చేస్తాడ్.

గుమాస్తా: నిజం సేట్‌జీ. తమతో ఒక చిన్న మనవి......

మార్వాడీ: మనవి? క్యా మనవి? అరెపంతుల్ పగలూ మనవి రాత్రీ మనవి. మాది ప్రాణాల్ తీస్తావ్.

గుమాస్తా: చిన్న మనవి సేట్‌జీ. ఈ శ్రావణమాసం అమ్మాయికి వివాహంచేదామనుకుంటున్నాను. ఇప్పటికేఈడు మీరిపోయింది. దాన్ని ఒక అయ్యచేతిలో పెడితే నా భారం తీరిపోతుంది. నలభై సంవత్సరాలనుంచి మీ కొలువు చేస్తున్నాను. ఈ సందర్భంలో తమరు కొంచెం సహాయం చేస్తే జన్మ జన్మాలకు......మీ......

మార్వాడీ: అరె పంతుల్ చూస్తు చూస్తు ఏమీ మాట్లాడుతావ్. మాదీ దివాలాలోఉంది, రాం దేవ్ దయతప్పించాడ్. ఖజానా ఖూనీచేశాడ్. అరె పంతుల్ క్యా కర్నాభాయ్. మాది బేగం మేము ఒంటీపూటాకూడా తింటున్నాం. రాం. రాం.

గుమాస్తా: ఏమో తమ దయ.

మార్వాడీ: చూస్తాం ముందు మాకీ ఇంకంటాక్సు గొడవ తప్పించు. (వెలుపల పిలుపు) సేట్‌సాబ్ హైక్యాఅందర్.

మార్వాడీ : కోనో?

(రజని ప్రవేశం)

రజని : హల్లో సేట్‌సాహెబ్. నమస్తే సేట్‌సాబ్. ఆదాబర్జ్ గుడ్‌మార్నింగ్. హౌ ఆర్ యూ సేట్‌సాబ్. పంతులూ బాగున్నారా? అమ్మాయి పెళ్ళి ఏమయింది?

మార్వాడీ : అరె మాస్టర్‌జీ, ఆగయా, ఆగయా తుం! ఆయియే ఆయియే మాస్టర్‌జీ! యహాఁ బైటియే, తషరీఫ్ రఖియే.

రజని : అంతా కులాసా సేట్‌సాబ్. భార్యాబిడ్డలూ అంతా బాగున్నారా? బిజినెస్ బాగా సాగుతోందా? ఇటీవల తిరుపతి యాత్ర చేశారని విన్నాను. బాలాజీ దర్శన్ సుఖంగా ఐందా సేట్‌సాబ్. మీరు బాలాజీకి ఏమొక్కుకున్నారో చెప్పనా?

మార్వాడీ : మాస్టర్‌జీ, జోస్యం చెబుతావ్, బోలో.

రజని : చెప్పనా పంతులూ (పంతులును చూస్తూ)

గుమాస్తా : చెప్పండయ్యగారూ.

రజని : గంటకో లక్ష బిజినెస్ హెచ్చాలనీ, ఇన్‌కంటాక్సు ఆఫీసరు లెక్కలు సూసీ సూడనట్లు వెళ్ళిపోవాలని, బ్లాక్ మార్కెట్ అవిచ్ఛిన్నంగా సాగాలనీ, ప్రపంచయుద్ధం త్వరలోవచ్చి, ధరలు పెరిగి, ఆహార సమస్య అధికమై ఖజానా నిండాలనీ, అందరూ నాశనమై మనంమాత్రం సుఖంగా ఉండాలనీ ఆస్తి భార్యపేరపెట్టి అప్పు ఎగయ్యాలనీ అవునా సేట్‌సాబ్.

మార్వాడీ : అరె మాస్టర్‌జీ చమత్కార్ చేస్తావ్. మాదీ దిల్ బ్యాట్రీలైట్‌వేసి చూసి చెప్పావ్ మాస్టర్‌జీ. క్యాబాత్

మాస్టర్జీ, దేస్ దేస్ తిరిగివచ్చావ్. అసలు దేస్ మే సమాచార్ చెప్పొ మాస్టర్జీ, మార్కెట్ బడాలో వుందా? ఛోటాలో ఉందా?

రజని : దేశానికేం బ్రహ్మాండంగాఉంది సేట్ సాబ్. ఉన్నవాళ్లు తింటున్నారు. లేనివాళ్ళు చస్తున్నారు. గవర్నర్లు ఊళ్లు తిరిగి రోడ్లుచూచి పోతున్నారు. మంత్రులు పరిపాలన మానివేసి తల ఒక జత గాజులు తొడుక్కొని పార్ల మెంటులో పచ్చీసాడుకొంటున్నారు. దేశానికేం సేట్‌జీ గ్రాండ్‌గా ఉంది.

మార్వాడీ : అరె మాస్టర్జీ కమ్యూనిస్టు అయ్యాడ్.

రజని : ఇంకాకా లేదు సేట్‌జీ. అవుదామనుకుంటున్నా. కమ్మం టారా? వద్దంటారా?

మార్వాడీ : అరె మాస్టర్జీ వాడు మాకి బడా మొగుడ్. మీరూ వాడు ఏక్ అయితే మాదీ ప్రాణ్ పోతుంది.

రజని : దివానా సేట్ సాబ్. మీరు బ్రతికి ఉన్నంతకాలం కమ్యూనిస్టు అవుతానా చెప్పండి? అయితే మన పను లెల్లా సాగుతాయ్.

మార్వాడీ : ఫిర్ మాస్టర్జీ దేశ్ సమాచార్ సీదా చెప్పొ మాస్టర్జీ మాదీపని ఏంచేశావ్.

రజని : మనపని ఐపోయింది సేట్ సాబ్.

మార్వాడీ : (భయంతో) అరె మాదీపని ఐపోయింది.

రజని : ఐపోయింది అంటే ఐందని సేట్ సాబ్.

మార్వాడీ : ఐసాబోలో. మాస్టర్జీ వెళ్ళడం పని కాకపోవడం దునియాలో లేదు. నెపోలియన్ మాస్టర్జీ ముందు బలా

దూర్. మాస్టర్జీ వాడు ఇనకంటాక్సువాడు మాకీ పీకల్‌పై కూచున్నాడ్.

రజని : వాడా? ఐ విల్, ఫోన్ హిమ్ నా. (రిసీవరు దగ్గరకెళ్ళి ఫోన్ తీసుకుంటాడు) ఎస్. ఐ. అం. రజని స్పీకింగ్. హాలో 207 Please ఇన్‌కంటాక్స్ ఆఫీసరు. కాన్తారావుగారా... ...ఎస్. వీడు... చమన్‌లాల్ లేడూ ...వీడి దుకాణంనుంచి మాట్లాడుతున్నాను ... ఎస్ వీడి మీాదికి దండయాత్ర చేశారట... ఎస్ ... ఎస్ ... ఏడుస్తున్నాడు పాపం ... టూ మంత్స్ ... టైం ... ఎస్ ... పంపుతా ... థాంక్ యూ (పెట్టేస్తాడు) (మార్వాడీతో) మీారు మన తాలూకని తెలియదు సేట్‌సాబ్. రెండు నెలల టైం అడిగాను ఇచ్చేశాడు. వాడు ఏదో ఫామిలీ డిఫికల్టీలో ఉన్నాట్ట. పాపం వాడి మొహాన ఓ వంద తగలెట్టండి.

మార్వాడీ : ఠీక్ ఇచ్చేద్దాం! మాస్టర్జీ? (గుమాస్తాతో) అరె పంతుల్. వాడు ఇంకంటాక్సువాడికి ఒక కవుర్ మే పెట్టి ఒక సౌ రుపయా ఇచ్చేయ్.

రజని : పంతులెందుకు? నేనిస్తాలెండి. పంతులూ ఆవంద ఇలా ఇవ్వు. (గుమాస్తా పెట్టె తెరచి ఓ వందరూపాయలనోటు రజనికిస్తాడు) (రజని దాన్ని తన పట్లాం జేబులో పెట్టుకుంటాడు) (ఫోను మ్రోగుతుంది) (రజని వెళ్ళి రిసీవరు తీసుకొని మాట్లాడుతాడు)

రజని : హాలో. ఓ తమరా? చంద్రశేఖర్ రావుగారా? కులాసా? నిన్నే వచ్చానండి. ఏముంది విశేషాలు. ఎలా ఉంది

ఆరోగ్యం ? గవర్నర్ ఎపుడొస్తున్నాడు ? ఓహో అమ్మాయి పెళ్ళి నిశ్చయమైందా? Congratulations ఓ ఐసీ టెంత్‌న ఫిక్స్ చేశారా? ఆల్ రైటు. ఓష్యూర్ పంపిస్తాను. ఆ దానికేంలెండి. ఉంటాను. థాంక్స్.
(రిసీవరు పెట్టేశాడు)

మార్వాడీ : కోన్ మాస్టర్జీ మాకీ మొగుడ్!

రజని : ఊ వీరా మొగుడే.

మార్వాడీ : కోన్ మాస్టర్జీ.

రజని : డి. యస్. పి. చంద్రశేఖరరావు.

మార్వాడీ : క్యా మాస్టర్జీ మాకీ బంధిఖానాలో తోస్తార్ ? జల్దీ బోలో మాస్టర్జీ.

రజని: దివానాసేట్‌సాబ్. అయ్యగారు బ్రతికిఉండగా నిన్నెవరయ్యా బంధిఖానాలో తోసేది ? డోన్ట్ వరీ. ఏమి లేదు. ఏదో తారీఖు వాడి కూతురు పెళ్ళట.ఆ అల్లుడి మొహాన పదివేలు పడేస్తేతప్ప వీడి కూతురు మెళ్ళో పుస్తె కట్టనంటున్నాట్ట. అందుకని మనల్ని ఒక పది వేలు అప్పడిగాడు.

మార్వాడీ : హప్పా కావాలీ. మాకీ కాగితం వ్రాయాలి మాస్టర్జీ.

రజని : అరె దివానా సేట్ జీ.పోలీసు వాళ్ళకిచ్చే డబ్బుకు ఉత్తరాలు పత్రాలూ ఉంటాయా? ఇచ్చెయ్యండి ఎందుకైనా మంచిది. ఇప్పుడే చెబుతున్నా. పత్రావయ్యా పంతులూ చెక్కు-బుక్.

మార్వాడీ : అరె మాస్టర్జీ. దస్ హజార్. దస్ హజార్ మాదీ ప్రాణం ఎగుర్తదీ మాస్టర్జీ.

రజని : ఇస్తే మీ ప్రాణం ఎగుర్తుంది. ఇవ్వకపోతే మీ ప్రాణం వాడు ఎగురగొడతాడు. ఏ బ్లాక్ మార్కెట్ కేసు లోనో నొక్కేస్తాడు. సేట్ సాబ్ వాళ్ళ అవసరానికి మనం ఆదుకుంటే మన అవసరానికి వాళ్ళు ఆదుకుం టారు. (గుమాస్తాదగ్గరినుండి చెక్కుబుక్కు తీసుకుని రాసి మార్వాడీ ముందుంచాడు) సంతకం చెయ్యండి.

మార్వాడీ : అరె రాం రాం మాస్టర్జీ.

రజని : క్విక్ సేట్ సాబ్. (మార్వాడీ సంతకంచేస్తాడు రజని దాన్ని తన పంట్లాం జేబులో పెట్టుకుంటాడు) (ఫోను మ్రోగుతుంది. మార్వాడీ బెదురుతాడు).

మార్వాడీ : ఫిర్ ఫోన్. అరె రాం రాం ఈ రోజు మాది దివాలా రోజు మాస్టర్జీ.

రజని : డోంట్‌వర్రీ సేట్ సాబ్ ఆఖరుకు అంతా అనుకూలంగా పరిణమిస్తుంది.

(వెళ్ళి రిసీవరు తీసుకుంటాడు—మాట్లాడుతాడు)

హల్లో ఓ నీవురా? ఎవరో అనుకుని మా సేట్ సాబ్ గాభరాపడ్తాడు. ఏరా? ఊ. నిన్ననే వచ్చారా? ఓ ఢిల్లీ వెళ్ళి... వాడు అంజనీలుగాడు కనుపించాడు. ఊ. ఎలాఉందిరా ఊళ్ళో? ఓ ఎవరూ... వస్తున్నారా... ఎందుకూ? చందాలు కావాల్టనా? ఎంతటా? దేశంలో బెగ్గర్లుకాక ఈ బెగ్గర్లు ఎక్కడ బయలుదేరారు? ఓ.

షూర్. సాయంత్రం పంపిస్తా. రైట్ థ్యాంక్స్ ఉంటా.
(ఫోను పెట్టేస్తాడు)

మార్వాడీ : కోన్ మాస్టర్జీ మాది మొగుడ్.

రజని : నీ మొగుడు—నా మొగుడు కాదయ్యా. దేశానికంతటికీ మొగుడ్.

మార్వాడీ : దేశ్ కా మొగుడ్.

రజని : మననాయకుడు లేదూ రంగనాయకుడు వాడు.

మార్వాడీ : సబ్ జన్ నాయక్, నాయక్, అంటారు వాడు.

రజని : వాడే గోలీలాడుకునే రోజులనుంచి నాకూ వాడికీ స్నేహం. బడిగూడా ఎగ్గొట్టి మిాటింగుల కెళ్ళేవాడు. వెధవ. మొదట్లో వట్టి పూర్ ఫెలోలెండి. ప్రాథమిక విద్యలోనే విద్యకు స్వస్తిచెప్పి దేశసేవలో దిగాడు. కొన్నాళ్ళు బస్‌కండక్టర్ ఏడ్చాడు. కొన్నాళ్ళు బ్లాకెట్ బుకింగ్ చేశాడు. తరువాత ఏదో ఉత్సవం జరుగుతుంటే దాంట్లోదూరి, కేకలేసి దెబ్బలుతిని అరెస్టయిజైలుకెళ్ళి తిరిగొచ్చి వేషంమార్చేసి, రాజకీయబాధితుడై, పది మందిపేర పదిపర్మిట్లూ, పదెకరాల పచ్చటి మాగాణీ కొట్టేసి, ఓ లక్ష వెనకేసుకుని, కడుపులోచల్ల కదల కుండా కూచున్నాడు నసీబ్ సేట్‌సాబ్. అంతా నసీబ్.

మార్వాడీ : నాయక్ మిాకీ దోస్త్?

రజని : ఊఁ. మాకు బడాదోస్త్ వాడు. ఒకే జామచెట్టెక్కి దొంగతనం చేశాం. ఒకే మంచంలో పడుకున్నాం. ఒకే కంచంలో తిన్నాం.

మార్వాడీ : నాయక్‌కూ ఏమి కావాలంటావ్.

రజని : వాడు డైరెక్టుగా తమర్ని అడుగలేక నాద్వారా మిమ్మల్నొక చిన్న సహాయం అర్థిస్తున్నాడు. ఈ ఊరికి ఎవరో ఒక పెద్ద లీడర్ వస్తాట్ట. పెద్ద ఫంక్షన్ ఏర్పాటు చేస్తున్నాడట. వాటికి పర్స ప్రజెంట్ చెయ్యాలట.

మార్వాడీ : చేసుకోమను.

రజని : తమరి పేర ఒక వెయ్యి చందా ఇప్పించమని...

మార్వాడీ : అరె రాం రాం క్యా మాస్టర్జీ. ప్రతి వెధవ మమ్మల్ని చందా అడుగుతాడ్. మాది దిమాఖ్ ఖరాబ్ అయింది మాస్టర్జీ.

రజని : వెధవకాడు సేట్‌సాబ్. లీడర్ లీడర్. కొందరు లీడర్లు కూడా మన క్రింద ఉండాలి సేట్‌సాబ్. ఈ రోజుల్లో చాలాఅవసరం. వాడికో వెయ్యి పారెయ్యండి. పంతులు ఆ చెక్‌బుక్ ఇలా ఇవ్వు.

మార్వాడీ : అరె రాం రాం. ఈ దిన్ మాకీ దివాలా దిన్ మాస్టర్జీ.

రజని : డోంట్ వరీ సేట్‌సాబ్. ఆఖరుకు అంతా అనుకూలం అవుతుంది. (గుమాస్తా చెక్‌బుక్ ఇస్తాడు. రజని దాని మీద రాసి, మార్వాడీ ముందుంచుతాడు)

రజని : సంతకం పెట్టండి.

మార్వాడీ : క్విక్ సేట్‌సాబ్ (మార్వాడీ సంతకంచేస్తాడు. రజని దాన్ని తన జేబులో పెట్టుకుంటాడు) సేట్‌సాబ్ డోంట్ వరీ, మనకో పదివేలుపోతే మట్టుకేం పది లక్ష లొస్తాయి. మంది రాజా జాతకం, సేట్‌సాబ్.

మనం మట్టిపెట్టామంటే బంగారమై ఊరుకుంటుంది. డబ్బునుకూడా డబ్బుతోనే కొనాలి షేట్‌సాబ్. అదీ ఎకనామిక్స్.

మార్వాడీ : టీక్ బాత్ మాస్టర్జీ. మాస్టర్జీ లండన్ మే పుట్టాల్సింది. చర్చిల్ గిర్చిల్ ఉల్టాచేసేవాడ్. మాస్టర్జీ అసలీ బాత్ చెప్పు మాస్టర్జీ. మంది బడాప్లాన్ ఏమిచేశావ్? కలకత్తాపని ఏమిా ఐంది?

రజని : ఓ బ్రహ్మాండంగా ప్లాన్ వేశాం. (గుమాస్తాతో) పంతులూ పొద్దెక్కింది ఇహ ఇంటి కెళ్ళుదూ.

గుమాస్తా : చిత్తం చిత్తం.

మార్వాడీ : అరె పంతుల్, ఘర్ చెలో.

గుమాస్తా : చిత్తం చిత్తం (ఖాతా పుస్తకంతో లేస్తాడు) చిన్నమనవి...

మార్వాడీ : క్యా మనవి?

రజని : చెప్పనివ్వండి.

గుమా : రేపు పండగ కదండి. జీతం తాలూకు ఒక్క పది రూపాయలు పడేయిస్తే... పిల్లలు బట్టలకు మరీ దుంప తెంచుతున్నారు.

మార్వాడీ : అరె పంతుల్. మిాకీ పండుగ. మాకీ దండుగ. మూడునెల్లజీతం ముందే వాడావ్.

గుమా : చిత్తం చిత్తం దయచేయు! (పోవడానికి సిద్ధమౌతాడు)

రజని : ఉండవయ్యా.

మార్వాడీ : క్యా మాస్టర్జీ.

రజని : పండుక్కు పదేం చాల్తాయి. ఓ యాభై తీసుకో. (మార్వాడీతో) ఇవ్వండి సేట్‌సాబ్, వదో పెద్ద బ్రాహ్మడు. బోలెడంత సంసారం.

మార్వాడీ: అచ్ఛా లేవ్. లేవ్ పంతుల్జి. (గుమాస్తా కుడబ్బిస్తాడు)

గుమాస్తా: వస్తానయ్యా (రజనికి నమస్కారం చేసి వెడతాడు)

రజని : సేట్‌సాబ్, ఒకరికి మనం పెడుతూవుంటే మనకువస్తూ ఉంటుంది. వెధవ–వెధవడబ్బును మనంచేశాంగాని అది మనల్ని చేసిందా ? సేట్‌సాబ్, డోన్ట్‌వరీ. మనకు పదివేలు పోయినాయంటే పది లక్షలు వచ్చాయన్న మాట.

మార్వాడీ : అరె మాష్టర్జి అంతా వుల్టాబాత్. సిదా ఉల్టా చేస్తాడ్, ఉల్టా సీదా చేస్తాడ్. మాష్టర్జి అసలీబాత్ చెప్పా.

రజని : అసలీ బాత్ చెప్పనా ? అంతా మనకు అనుకూల మయింది సేట్‌సాబ్. ఆ కలకత్తాలో ఆ ఇంజనీయర్ గాడిని పట్టుకునేసరికి నా తలప్రాణం తోకొచ్చింది. మిషన్ వాడిదగ్గరుంది. వాడికి లక్షమాటలు చెప్పి, లక్షఆశలు చూపి పట్టుకొచ్చాను సేట్‌సాబ్. మీరు చాలా జాగ్రత్తగా ఉండాలిసుమా. పనంతా పూర్తిగా ముగిసేవరకు ఎక్కడైనా పొక్కారంటే...

మార్వాడీ : అరె క్యాబాత్ మాష్టర్జి. మాకీ పీకల్ తెగినా మాట మాటే. ఐతే ఆ యింజనీయర్‌సాబ్‌కు పట్టు కొచ్చావ్.

రజని : ష్యూర్. పిలువనా? ఇక్కడికే పట్టుకొచ్చా. మన విజిటింగ్‌రూంలో కూచున్నాడు.

మార్వాడీ : అరె ఇంజనీయర్ ఆగయా? అచ్ఛా; అచ్ఛా. అందర్ రమ్మను. జర అందర్ బులావ్ మాష్టర్జీ.

(బిగ్గరగా సుధాకర్ సాబ్)

రజని : (బిగ్గరగా) ప్లీజ్ కమిన్ మిష్టర్. (శేఖర్ ప్రవేశిస్తాడు. సూటులో వుంటాడు.)

రజని : మీట్ మిష్టర్ చమన్‌లాల్ సూదీరాం కరంచంద్ సేట్, ది గ్రేట్ జ్యూయల్ మాగ్నెట్ ఆఫ్ అవర్ కంట్రీ.

శేఖర్ : నమస్తే సేట్‌సాబ్ (మార్వాడీ, శేఖరూ ఒకర్నొకరు షేక్‌హాండ్ చేసుకుంటారు)

మార్వాడీ : నమస్తే నమస్తే. ఆయియే ఆయియే ఇంజనీయర్ సాబ్. తషరీఫ్ రఖియే. మీకిపేరు, బడాబడావిన్నాం. మీకికోసం మాకి కండ్లు కాయల్ కాచి పూవుల్ పూచింది. దిల్ తప్‌తప్ కొట్టుకుంటూ వుండాది. (లోపలికి తిరిగి) అరె మహరాజ్ జర షర్బత్ లావ్. (షర్బతు తేబడుతుంది. మార్వాడీ షర్బతును శేఖరుకూ రజనీకి యిస్తాడు)

మార్వాడీ : చాలా తండా షర్బత్. లీజియే ఇంజనీయర్ సాబ్. (శేఖరు గ్లాసు తీసుకొని తాగుతాడు)

మార్వాడీ : తమరి నామ్ క్యా ఇంజనీయర్ సాబ్.

రజని : బదరీ విశాల్ సుధాకర్ బరోడీకర్ సేట్‌సాబ్. మన ఇంజనీయర్ సాబ్ ఏమనుకున్నారు ఆర్క్‌మెడీసు,

న్యూటన్, ఐన్‌స్టీన్‌లకు మించిన బుర్ర. అమెరికా, స్విట్జర్లాండు, ఇటలీ, ఇంగ్లండ్ మొదలయిన గ్రేట్ వెస్టరను కంట్రీస్ తిరిగి స్పెషల్‌స్టడీస్ చేసి వచ్చారు. పదహారు సంవత్సరాలు పగలూ రాత్రి పరిశ్రమించి (నవ్వుతూ) మన మిషన్ కనిపెట్టారు.

మార్వాడీ : అచ్ఛా.అచ్ఛా. మిషన్ తెచ్చారా? జర చూపించండి ఇంజనీరు సాబ్.

రజని : అరె దివానా సేట్‌జీ, మిషన్ అంటే చంటిపిల్లా డనుకున్నావా? చంకలో పెట్టుకుని ఊరంతా తిరగటానికి. మన కంపెనీబంగళాలో అండర్‌గ్రౌండ్ హావుసులో దింపించాం. సేట్‌సాబ్ ఇదేం మజా.

మార్వాడీ : అచ్ఛా, అచ్ఛా.

రజని : ఇంజనీయరుసాబ్, మన సేట్‌సాబ్‌కు మనమిషన్ ఎలా పనిచేస్తుందో, స్లయిటుగా ఎక్స్‌ప్లైన్ చెయ్యండి.

శేఖర్ : ఓ. కె. (చుట్టూ చూచి) చుట్టూ ఎవరు లేరుకదా గోడకు చెవులుంటాయి.

మార్వాడీ : తలుపుల్ బంద్‌చేసి వస్తా. (పోయి తలుపేసి వస్తాడు) అచ్ఛా. చెప్‌కోండి ఇంజనీయర్‌సాబ్.

రజని : జాగ్రత్తగా వినండి సేట్‌సాబ్.

శేఖర్ : సేట్‌సాబ్! ఇదిచాలావిచిత్రమైన మిషన్. దీని పేరు కామధేను మిషన్. పదహారు సంవత్సరాలు ఈమిషన్ ఫార్ములాకోసం అహర్నిశలు తపస్సుచేశాను. చదివిన పుస్తకం చదవకుండా చదివాను. ప్రపంచంలో అన్ని దేశాలు తిరిగి, అన్ని లైబ్రరీలు తిరిగేశాను. ఎంతకు

తట్టిందిగాదు. ఛీ అనిపించింది. జీవితముమీద విసుగెత్తింది. ఈ శ్రమంతా వృథా అనిపించింది. ఆత్మహత్య చేసుకుందామని అమావాస్య అర్ధరాత్రి సముద్రము ఒడ్డుకెళ్ళాను. అటోఇటో తేలాలి. ఈ మిషన్ కనిపెట్టి ప్రపంచమేధావుల్లో మనపేరు స్థిరంగా నిలిచిపోవడమో లేక ఈ పాడుప్రాణం ఫైసల్ కావడమో ? ఈ నిశ్చయంతో సముద్రంలో అడుగుపెట్టాను. అల మీాద అల ముంచేస్తోంది. ఇహ కాళ్ళాడటం లేదు. చివరకు సడెన్ ... మెరుపల్లే తట్టింది. న్యూటన్‌కూ అంతేనట. వెయ్యేనుగుల బలంతో మళ్ళీ లోకంలోకి వచ్చా. ప్రపంచాన్ని జయించాను సేట్‌సాబ్. ప్రపంచాన్ని జయించాను.

మార్వా : అరె రాం రాం.

రజని : కొంచెం షర్బత్ తీసుకోండి సేట్‌సాబ్.

శేఖర్ : వినండి సేట్‌సాబ్, మనమిషనుపేరు, ది గ్రేట్ కామధేనుప్లాంట్. ప్రపంచాన్ని డబ్బు పరిపాలిస్తూంది. డబ్బే మనకోరికలు తీరడానికి మూలసాధనం. ఈ మిషనుతో డబ్బునే పాలిస్తాం. అందుకని మన మిషనుకు ది గ్రేట్ కామధేనుప్లాంట్ అని నామకరణం చేశాం. మరచా సేట్‌సాబ్ మన మిషను ఆపరేషను చెబుతా వినండి.

మార్వా : అచ్ఛా అచ్ఛా.

రజని : గో ఆన్ మిస్టర్ సుధాకర్.

శేఖర్ : మన మిషనుకు 5 అరలుంటాయి. 5 అరల్లో 5 పోతలుంటాయి. 5 అరలకూ 5 వాల్వులుంటాయి. 5 వాల్వులకూ 5 తలుపులుంటాయి.

మార్వా : అచ్ఛా.

శేఖర్ : ఒక రూపాయినోటు తీసుకుందాం. మిషనులో పెట్టి లివరు స్విచ్ వేస్తాం. రెండో అరకు చేరేసరికి రెండు రూపాయలనోటుగా మారిపోతుంది. మూడో అర చేరగానే 5 రూపాయలనోటుగా మారుతుంది. నాలుగో అరలో పదిరూపాయలనోటుగా మారుతుంది. అయిదో అరలో వంద హండ్రెడ్ రుపీస్ నోటుగా మారిపోతుంది. ఏ నోటుకావాలంటే ఆ అరలో స్విచ్ ఆన్ చేసి, ఆ నోటు తీసుకుంటాం.

మార్వా : అరె క్యా క్యా సాబ్.

శేఖర్ : సబ్ మన అండర్ గ్రౌండ్ డెన్ కు రండి. మీ స్వంత కళ్ళతో స్వంతంగా చూడొచ్చు.

మార్వా : అచ్ఛా, అచ్ఛా. రేపూవస్తాం మాస్టర్జీ. కైసా ఇంజనీర్ సాబ్ ను పట్టుకొచ్చావ్. మాకూ సాక్షాత్ లక్ష్మి తెచ్చావ్.

రజని : అరమైందా సేట్ సాబ్. ఈ మిషన్ మనదగ్గరుంటే అమెరికానైనా కొనేయవచ్చు. ఆటంబాంబైనా హాఠాత్తుగా చల్లారుతుంది సేట్ సాబ్. ప్రపంచ చరిత్రలో ఇంతవరకు కనివినిఎరుగని మిషన్ ఇది. మన కంపెనీకి ప్రపంచ కంపెనీల ప్రాస్పెక్టస్ లన్నీస్టడీచేసి అన్నిటికీ మించిన బ్రహ్మాండమైన ప్రాస్పెక్టస్ తయారుచేశాం.

250 క్లాజులు రాశాం. ఇరుక్కొన్న మనిషిమళ్ళీ బయటికివెళ్ళడు సేట్‌సాబ్. డబ్బుతో మనుషులను సర్కసు చేయిస్తాం. రూపాయి మెంబర్‌కు మెంబరుషిప్ కట్టిన వారంలో 72 రెట్లు హెచ్చు ఇస్తాం. అందులోకి మన కంపెనీలో ఫిక్సెడ్ డిపాజిట్‌మీద ఉంటుంది. చదవండి సేట్‌సాబు ప్రాస్పెక్టస్. (పుస్తకంఇస్తాడు) మనుషులు అహర్నిశలూ లక్షల కానుకలతో మన కంపెనీ చుట్టు ప్రదక్షిణం చేయాలి సేట్‌సాబ్.

మార్వా : అరె గవర్నమెంటువాడ్ మీ కీ ప్రాస్పెక్టస్ రిజిష్టరు చేశాడ్ ?

రజని : వాడు ఇట్లాంటివే రిజిష్టరుచేస్తాడు సేట్‌సాబ్. మన కంపెనీల్లాంటివి అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీల్లాంటి ఫార్వర్డు కంట్రీస్ లన్నిటిలో ఉన్నాయని ఆ ఉదాహరణలిస్తూ ముందే ఒక చిన్న ఉపోద్ఘాతము రాశాను. చూడండి మన కంపెనీకి ది గ్రేట్ ఇండియన్ మ్యూచ్యుల్ ఎడ్ కంపెనీ లిమిటెడ్ అని నామకరణం చేశాం. ఎందుకైనా మంచిదని మిమ్మల్ని మేనేజింగ్ డైరెక్టరుగా వేయించాం.

మార్వా : మాకీ బేడీల్.

రజని : డోన్ట్‌వరీ సేట్‌సాబ్. సంఘాన్నే మనం బంగారు సంకెళ్ళతో బంధిస్తుంటే మనకెవరండీ సంకెళ్లువేసేది.

మార్వా : అచ్ఛా. అచ్ఛా.

రజని : దివాలీకి బ్రహ్మాండంగా మనకంపెనీకి ప్రారంభోత్సవం చేదాం. అవసరమైతే ప్రీమియర్‌నే ప్రెసిడెంటుగా పిలి

పిస్తాను. ఈలోగా మిషను కంప్లీటు అవుతుంది. ఒక లివర్ తరుగుబడితే అమెరికాకు ప్రాశాం. వస్తుంది. సేట్‌సాబ్! మన ఇంజనీరుసాబుకు ముందు ఒకపదివేలు అడ్వాన్సు ఇప్పించండి. కొన్ని లివర్సు, కొన్ని నట్లు, బోల్టులూ, బాల్‌బేరింగులూ, అవీ ఇవీ తెప్పించాలి. పైగా ఆయన మేంటేనన్సుకు.

మార్వా : దస్ హజార్.

రజని : మరి ఊరికే ఉల్సాగా కాజేద్దామనుకున్నారా డబ్బు?

మార్వా : అరె మాస్టర్జీ ముందు మాకీ మిషను చూపుజీ.

రజని : రేపు వచ్చి చూచుకోండి. కావాలంటే నా రెండు కళ్ళుకూడా అప్పిస్తాను.

మార్వా : వో బాత్ నై మాష్టర్జీ. మా దగ్గర రొఖ్ఖం అయిపోయింది. బంగార్ డౌన్ అయింది.

రజని : లోపలికెళ్ళి అమ్మగార్నడిగి పట్రాండి సేట్‌సాబ్. మీ దగ్గర లేకపోయినా ఆమె దగ్గరుంటుంది.

మార్వా : అరె. హాడదీ దానిదగ్గర ఏమీాఉంటుంది. గాజుల్ ఉంటాయ్, చీరల్ ఉంటాయి.

రజని : లేకపోతే చెక్ రాయండి సేట్‌సాబ్. బ్యాంకిలో మేమే తీసుకుంటాం.

మార్వా : అరె మాష్టర్జి! ఈ రోజు ఇప్పటికే 15 హజార్ ఖర్చయింది.

రజని : ముందు ఒక వెయ్యి రూపాయలు ఇంజనీర్ సాబ్‌కు ఇప్పించండి సేట్‌సాబ్. లేకపోతే లేదని చెప్పండి. ఈ సాయంత్రం మేల్‌లో పంపేస్తా.

మార్వా : అరె మాష్టర్జి జర ఆగు తెస్తాం.

రజని : అమ్మగార్నడగండి, ఆమెదగ్గర రెడీక్యాష్ వుంటుంది. (మార్వాడీ పోతాడు. శేఖర్‌తో) గ్రాండ్ బ్రదర్ ఏదీ ఒక్క షేక్‌హాండ్ పడెయ్.

శేఖర్ : (ఇస్తూ) నాకు మహా గాభరాగా వుంది రజని.

రజని : డోన్ట్‌వరీ మహా గ్రాండ్‌గా ఆడేశావు డ్రామా. నిజంగా నీకింత ధైర్యముందనుకోలేదు. కాలం కలిసొస్తే అంతేనోయ్. దొర దొంగక్రింద దొంగ దొర క్రింద చలామణి అయిపోతాడు. డోన్ట్ వరీ.

శేఖర్ : ఏమో మిష్టర్ రజనీ! నాకు మాత్రం...

రజని : గాభరా తరువాత. ముందు డబ్బుతీసుకొని పుస్తకాలు కొనకు అప్పులు తీర్చెయ్.

మార్వా : (వస్తాడు) ఏ లేవ్ ఇంజనీయర్‌సాబ్. ప్రస్తుతం రెడీక్యాష్ లేదు. ఈ హజార్ లేవ్. కల్ బాకీ రొఖ్ఖం పంపిస్తాం.

శేఖర్ : థ్యాంక్యూ (జేబులో పెట్టుకుంటాడు)

రజని : పోనీ చెక్ ఇవ్వండి సేట్‌సాబ్. మరెక్కడయినా మార్చుకుంటాం.

మార్వా : అరె మాష్టర్జి, బాకీ రొఖ్ఖం కల్ ఇచ్చేస్తాం.

రజని: ఏం మామీద నమ్మకంలేదా సేట్‌సాబ్. మీ డబ్బు తీసుకుని దేశాలమ్మీద పోతామనుకున్నారా ?

శేఖర్ : మాష్టర్జి ఐ షల్ గెట్ ఎలాంగ్.

మార్వా : వో బాత్ నై మాష్టర్జి. నీవు కలకత్తాపోయావ్. దస్ హజార్ ఖర్చుఅయింది. సోనా డౌన్‌లో ఉంది.

సెక్యులేషన్ బంద్ అయింది. సబ్ మార్కెట్ నిద్ర పోతూఉండాది. మాస్టర్జీ మీకీ అప్పుడు దస్ హజార్. ఈ దివాలా రోజూ పచ్చీస్ హజార్ మాస్టర్జీ. మందీ పని మట్టిఅయింది.

రజని : సేట్‌సాబ్, మీకు పట్టూవిడుపూ తెలీదు. ఈమాస్టర్జీ తలుచుకున్నాడంటే ఇన్నాళ్ళూ నిద్రపోతున్న మార్కెట్టును ఇవాళ లేపిస్తాడు.

మార్వాడీ : క్యా మాస్టర్జీ మార్కెట్ లేస్తదీ.

రజని : లెమ్మంటే లేస్తది. లేపించనా?

మార్వాడీ : అరె మాస్టర్జీ బంగారు డౌన్ అయింది.

రజని : జంప్ ఇస్తుంది. క్షణంలో లక్షలు.

మార్వాడీ : మాస్టర్జీ...

రజని : లక్షలు. లక్షలు సేట్‌సాబ్.

మార్వాడీ : సచ్.

రజని : సేట్‌సాబ్ మార్కెటు లేపిస్తాను ఏమిస్తారు?

మార్వాడీ : అరె మాస్టర్జీ, మార్కెట్ లేవాలి మాకీ హాఫ్, మీకీ హాఫ్.

రజని : మాటంటే మాటే సేట్‌సాబ్! క్షణంలో లక్షలు, కోట్లు, మిలియన్లు. జాగ్రత్త సేట్‌సాబ్.

మార్వాడీ : అరె మాస్టర్జి మాకీ పెట్టి మీరూ తింటే కాదంటాం? క్యా బాత్?

రజని : బాలాజీమీద ప్రమాణంచెయ్యి.

మార్వాడీ : బాలాజీపై ప్రమాణ్.

రజని : అచ్ఛా. (ఫోనుదగ్గరకు పోతాడు)

హల్లో! 402 Bullion Market Please. మాస్టర్జి బాత్ కర్ రహాహూం. అచ్ఛా. సోనా Opening please? అచ్ఛా 95—1,000 Tolas, నై నై 5,000 Tolas, Listen please 10,000 Tolas, Phone No. 2833 Chaman La'es Jewellrey Mart: అచ్ఛా దస్ మినిట్ బాద్‌మే బాత్ కరో! (ఫోను పెట్టేస్తాడు)

మార్వాడీ : మాస్టర్జి మాకీ ఇదిఆఖరీరోజు. దునియా మొత్తం కొనేస్తాం.

రజని : (ఫోనుదగ్గరనుంచి వస్తూ) ఇవ్వాళ భూమిని కొనండి, రేపు ఆకాశాన్ని కొనండి సేట్‌సాబ్.

మార్వాడీ : మార్కెట్ డౌన్ కొడితే మాకీ ఫట్టీకొట్టి క్రిష్ణామే మునిగిపోతాం.

రజని : సేట్‌సాబ్, పదినిమిషాల్లో మనం ప్రపంచానికి డిక్టేటర్ కాబోతున్నాం. సేట్‌సాబ్ జాగ్రత్తగాఉండండి. మీ పేరుమీద ఆడాను. పదినిమిషాలు పదిలక్షలు సేట్‌సాబ్. అయిదులక్షలు నావి. మాటతప్పితేమళ్ళీ...

మార్వాడీ : అరే భాయి, మాకి ఎందుకు మాట తప్పుతాం. హరిచంద్రుడ్ మాముందు బలాదూర్.

రజని : డబ్బు సేట్‌సాబ్ డబ్బు. డబ్బుకూ, ఆడదానికీ, కీర్తికీ లోనుగాని వెధవ హిస్ట్రీలో లేడు. (ఫోన్ మ్రోగుతుంది. రజని, మార్వాడీ ఒకరికొకరు ముందు తీసుకోవాలని కీచులాడుకుని రజనే తీసుకుంటాడు. )

రజని : క్యా బోలో క్లోజింగ్ 150 అచ్ఛా దేవ్ బోలో ఖరీద్ కర్ దేవ్ అచ్ఛా. (రిసీవరు పెట్టేస్తాడు)

మార్వాడీ : అరె క్యా మాస్టర్జి, క్యా క్లోజింగ్ 150 మాకీ కోటీశ్వర్ అయ్యాం.

రజని : జీ.

మార్వాడీ : సచ్.

రజని : సచ్.

మార్వాడీ : మేమూ కోటీశ్వర్. అరె మహారాజ్ మేమూ కోటీశ్వర్. భగవాన్ మేమూ కోటీశ్వర్. బాలాజీకి బ్రహ్మోత్సవం చేయిస్తాం. మేమూకోటీశ్వర్. హాహా హాహాహా. (పెద్దగా నవ్వుతాడు. కుర్చీలో కూలబడ తాడు. నవ్వు ఆగిపోతుంది) అరె భగవాన్, మాకీ తల్లి బ్రతికిఉంటే ఎంతా ఖుష్ అయ్యేది? అరె భగ వాన్ (ఏడుస్తాడు)

రజని : (షర్బత్ గ్లాసు ఇస్తూ) సేట్‌సాబ్ కొంచెం షర్బతు పుచ్చుకోండి. చల్లబడుతుంది హిస్టీరియా.

మార్వాడీ : అచ్ఛా. అచ్ఛా. (తాగుతాడు) (కొంచెము నిశ్శబ్దం)

రజని : ఇపు డెల్లావుంది?

మార్వాడీ : జర ఠండా ఐయింది.

రజని : కొంచెం సిగరెట్ కాల్చండి. (సిగరెట్ నోట్లో పెట్టి వెలిగిస్తాడు)

మార్వాడీ : ఏక్ బడాజ్వర్ వచ్చినట్టుంది!

రజని : డబ్బొస్తే మరి జ్వరంరాదూ? అన్ని జ్వరాల్లోకీ డబ్బు జ్వరం పెద్దదికదూ? సేట్‌సాబ్ ఇప్పుడు మీకు ప్రపం చము ఎట్లా కనిపిస్తుంది?

మార్వాడీ : అరె, మాస్టర్జీ మాకీ దునియా ఉల్టాకొట్టినట్టు కనిపిస్తూ ఉండాది. మనిషి తలతో నడుస్తున్నాడ్. మసకా మసకాలో ఉండాది దునియా. అరె మాస్టర్జి ఇపుడు టైం ఎంతా ఐంది.

రజని : ఆరుగంటలైంది.

మార్వాడీ : పగలా రాత్రా ?

రజని : (సిగరెట్ టిన్ చూపుతూ) సేట్‌సాబ్ ఇదేమిటి ?

మార్వాడీ : ఏంటి ?

రజని : ఇదేమిటి చెప్పండి ?

మార్వాడీ : గడియార్.

రజని : ఇది గడియారమా ? (నూరురూపాయల నోటు తీసి చూపుతూ) ఇదేమిటి ?

మార్వాడీ : ఇది రుపయా. సౌ రుపయా.

రజని : సేట్‌సాబ్. తమరికి అన్నిజ్ఞానాలూ నశించినా డబ్బు జ్ఞానం నశించదేం? నీవు చచ్చినా నీ చేతికింద రూపాయలు టంగున మోగిస్తే టఫీమని లేచికూర్చుంటావ్. సేట్‌సాబ్ ఇది నోటుకాదు కుక్కపిల్ల.

మార్వాడీ : క్యా మమ్మల్ని బేవకూఫ్ చేస్తావ్. ఇది నోటు.

రజని : అచ్ఛా ఒప్పుకున్నాం. సేట్‌సాబ్ మా భాగం మాకిప్పించండి వెడతాం.

మార్వాడీ : క్యా భాగం ?

రజని : ఫిఫ్టి ఫిఫ్టి అని మాటిచ్చారుకదూ సేట్‌సాబ్.

మార్వాడీ : క్యా మాటా ?

రజని : స్పెక్యులేషన్‌లో మాట. డబ్బుతో చదరంగం ఆడాం. భాగం యిస్తానన్నారు.

మార్వాడీ : క్యా స్పెక్యులేషన్ ? ఎపుడూ ఆడాం.

రజని : సేట్‌సాబ్ వేషాలు చాలించి మా డబ్బు మాకు పారెయ్యండి.

మార్వాడీ : ఏంటి మాస్టర్జీ సబ్ ఝూటా బాత్ చెబుతావ్. మీకీ మేం భాగం ఇస్తామన్నాం.

రజని : అనలా ?

మార్వాడీ : ఈ జిందగీమే అనలా !

రజని : సేట్‌సాబ్.

మార్వా : క్యా బెదిరిస్తావ్ ? స్టేషన్‌కీ ఫోను చేస్తాం.

రజని : సేట్‌సాబ్ మాట తప్పుతున్నారు.

మార్వా : అరె చుప్ గహూ మాస్టర్జీ.

రజని : అచ్ఛా, దివానా సేట్‌జీ నాకెందుకు భాగం? సన్యాసి ముండాకొడుకును. పెళ్ళామా ? పిల్లలా ? ఊరికినే గమ్మత్తుకన్నాను. అంతా మీరే తీసుకోండి సేట్‌సాబ్.

మార్వా : వైసాబోలో మాస్టర్జీ. మాస్టర్జీ అచ్ఛా ఆద్మీ.

రజని : డబ్బడిగితే లుచ్చా ఆద్మీ. వద్దంటే అచ్ఛా ఆద్మీ. అంతే సేట్‌సాబ్. మనం కోటీశ్వరులమైనట్టు ఎవరితో చెప్పకండి. పాత అప్పులవాళ్ళందరూ ముసురుతారు.

మార్వా : మాకీ పీకల్ పోయినా చెప్పం. నీవు చెబుతావ్ మాస్టర్జీ. నీకీ ఒక వెయ్యి యిస్తాం.

రజని : వెయ్యొద్దు, పొయ్యొద్దు. సేట్‌జీ నే నెందుకు చెబుతాను. ఎందుకైనా మంచిది. ఊళ్ళో పెద్దలందరికి ఓ చిన్న పార్టీ పడేద్దాం.

మార్వా : అచ్చా కల్ మనబంగళాలో ఏర్పాట్ చెయ్. మిషన్‌భీ తనకీ చేస్తాం.

రజని : అచ్ఛా. సేట్‌సాబ్. రేపు సాయంత్రం 5 గంటలకు మన బంగళాలో పార్టీ. కారు పంపుతాను రండి. వస్తారుకదూ? నమస్తే.

(రజని లోనికి వెడతాడు)

మార్వా : అచ్ఛా తప్పకవస్తాం. అచ్ఛా మేము కోటీశ్వర్. హాహాహాహాహాహాహా... ... ... ...

( తెర )

# మహా ఢప రంగం

(గ్రాండ్ ఇండియన్ కంపెనీ ఆఫీస్, జంతర్
ఈజ్ పేయింగ్ కార్డ్సు విత్ హింసేఫ్)

మంతర్ : (ప్రవేశిస్తూ) గుడ్ మార్నింగ్ మిష్టర్ జంతర్.

జంతర్ : వెరీ బేడ్ మార్నింగ్ మిష్టర్ మంతర్.

మంత : అదేమిట్రా ? ఇదేనా మన స్నేహం ? నేను గుడ్ మార్నింగ్ అంటే నువ్వు బేడ్ మార్నింగ్ అంటావ్?

జంత : పొద్దున్నే నీ ముఖం చూస్తే బాడ్ మార్నింగ్ కాక గుడ్ మార్నింగెట్లా అవుతుంది ?

మంత : నా మొఖాని కేమోయ్ మొహారీల్లాగుంటే ? నా మొహంలాంటి మొహం తనఖాతాలో ఎన్నడూ చూడలేదని రంగమ్మ సర్టిఫికేటు ఇచ్చింది.

జంత : రంగమ్మ ఎవ్రా మిష్టర్ మంతర్ ?

మంత : రంగమ్మనే ఎరుగవు ? మన మాస్టర్జీ గురువుగారి ప్రయివేటు ప్రేయసి.

జంత : సరేగాని, ఊళ్ళో విశేషా లేమిటోయ్ ?

మంత : ఏమున్నాయ్ అన్నీ బాగానే వున్నాయిగాని, మన జేబులుమాత్రం కాళీ. పదిరోజులనుంచీ పస్తున్నాయి.

జంత : ఏం ?

మంత : డబ్సు బ్రదర్, డబ్సు—కాళి—

జంత : డబ్బుల కేమిటోయ్. మన రూపాయల మిష నుండగా? నేనేం చేశానో తెల్సునా......సరాసరి హోటల్ కెళ్ళాను. రెండట్లు, మూడిడ్లీ, కాఫీ కొట్టే శాను. బిల్ సార్ అన్నాడు. ఉండవోయ్, రూపాయల మిషన్ తయారుకానీ అని వచ్చేశాను.

మంత : ఏడ్చావ్. అన్నీ కోతలు.

జంత : కోతలేంటి మోతెక్కిస్తే.

మంత : ఏడ్చావ్ ఊరుకో.

జంత : అదిగో అబ్బాయ్ ఆ మాటంటే నిజంగా ఏడ్చేస్తాను.

మంత : వద్దులే, నువ్వేడిస్తే నీ కళ్ళు తుడవడానికి నా దగ్గర కర్చీపైనా లేదు.

(శేఖరు ప్రవేశించి వెళ్ళిపోతాడు)

మంత : అదుగో వాడే ఇంజనీరు.

జంత : ఇంద్రుడల్లే వున్నాడు.

మంత : ఇంద్రు డేమిటి, దేవేంద్రుడల్లే ఉంటే.

జంత : సరేలే. రాత్రి క్లోజింగెంతరా?

మంత : జీరో.

జంత : ఓపెనింగ్.

మంత : అదీ జీరో.

జంత : ఏడ్చావ్. నీ బ్రతుకంతా జీరోయే?

భీముడు : (ప్రవేశించి) ఏక్, దో, తీన్, చార్, పాంచ్ మీ రెందుకొచ్చారిక్కడికి? మిమ్మల్ని మాస్టర్జీ అయ్య గారు రానివ్వద్దన్నారు తెలుసా?

జంత : మే మెవరమో తెలుసా? మాస్టర్జీ ముఖ్యశిష్యులం - నేను కుడిభుజం, వీడు ఎడమభుజం.

మంత : నో. నో. నేను కుడిభుజం, వీడు యెడమభుజం.

జంత : ... ...

మంత : ... ...

భీముడు : సైలెన్స్. ఏయ్ అబ్బాయిలూ ఇది ఆఫీసు. ఇక్కడ ఉండదల్చుకుంటే మీరు నోర్మూసుక కూర్చోండి.

మంత : సరే. ఒప్పుకున్నాం. అరేయ్ జంతర్! నీవు నా నోర్మూయరా. నేను నీ నోరుమూస్తాను.

జంత : ఏం ?

మంత : ఎవరినోరు వారు మూసుకోవడం అప్రతిష్ట పని కాదుటోయ్.

జంత : ఔనులే. మ్యూచ్యువల్ ఎయిడ్ మంచిదంటావ్. అంతేనా ? (కూర్చుంటాడు)

భీముడు : ఏక్, దో, తీన్ (అంటూ వుంటాడు)

జంత : భీముడూ !

భీముడు : నా పేరు నీకెలా తెలిసింది.

మంత : నీ తీరుచూస్తే నీపేరు తెలియదోయ్ ?

భీముడు : అసలు నా పేరు రాముడు. మాస్టర్జీ అయ్యగారి ముద్దుపేరు భీముడు.

మంత : అసలు పేరు ఆలోచించి పెట్టుండరులే. అయ్యగారు పెట్టినపేరే సరిపోయింది.

జంత: అయితే ఏమిటి భీముడూ? ఒంట్లు లెక్కెడుతున్నావ్.

భీముడు : ఆ అదా! ఈ పాడుజల్మం ఎత్తిన తర్వాత ఎన్ని పాడు జల్మాలు సఫా చేశానాఅని లెక్కెట్టుకుంటున్నా.

మంత : అయితే ఈ పాడు ప్రపంచంనుంచి ఎంతమందికి టికట్టిప్పించావోయ్?

భీముడు : ఏక్, దో, తీన్, చార్, పాంచ్ ... ఐదుగురికి.

జంత : అచ్ఛా. నిన్ను అంతర్జాతీయ హంతకుల ఫెడరేష నుకు యునానిమస్ డెలిగేటుగా పంపిస్తాం.

భీముడు : అంతా అయ్యగారి చలవే. మొదటి ప్రాణం మా అయ్యదే. వాడు వట్టి రాక్షసముండాకొడుకు. మా అమ్మ దేవతల్లేవుండేది. రోజూ తాగొచ్చి చావమోదే వాడు. ఒకరోజు ఉండిఉండి చూడలేక మూలనున్న దుడ్డుకర్ర పుచ్చుకుని తల చితక్కొట్టేశాను. కెవ్వున కేకేసి ఎగిరాడు.

మంత : గ్రాండ్. మీ నాన్నవల్ల నువ్వు పుట్టావ్. నీవల్ల మీ నాన్న చచ్చాడు. టిట్ ఫర్ టాట్ అన్నాడు.

జంత : భీముడూ! ఇంతకూ నీ పెళ్ళయిందా?

భీముడు : ఓ.

జంత : పిల్లలెందరు?

భీముడు : ఆ పాడుముండ మూడునెల్లు జరక్కుండానే లేచి పోయింది.

జంత : (మంతర్ తో) మీ బ్రదరోయ్.

మంత : మన వైఫ్ తిరిగొచ్చిందోయ్. ఏమిటే యాత్రచేసి వొచ్చావంటే ఛేంజ్ ఆఫ్ వెదర్ అంది.

జంత : భీముడూ, మాస్టర్జీ అయ్యగారు మంచివాడంటావా? చెడ్డవాడంటావా ?

భీముడు : అయ్యగారికేం ధర్మరాజు. ఆ చమన్‌లాల్ సేట్ గాడు నా కొంపతీసింది. కొన్నాళ్లు ఆడిదగ్గర ముఠా కూలీగా వడ్డా. నా పెళ్ళాంమీద కన్నేసి ఆ బాపన గుమాస్తాచేత చెప్పించాడు. ఒళ్ళు విరగగొట్టేవాణ్ణి. మాస్టర్జీ అయ్యగార్ని చూచి ఊరుకున్నా. ఈయాల మిసను సూత్తాని కొత్తాడంట. మన కర్మాని కేంజేస్తాం బాబు. ముణ్ణెల్లు జరక్కుండానే ఎటో వెళ్ళిపోయింది. మాష్టర్జీ అయ్యగారు నా దగ్గరుండిపోరా అంటే ఉండిపోయా. అయ్యగారిది జాలిగుండె. అంతా అనవసరంగా ఆడిపోస్తారు.

(ఒక పెద్దమనిషి ప్రవేశిస్తాడు)

పె.మ : ఏమండీ ? గ్రాండ్ ఇండియన్ మ్యూచ్యుయల్ ఏయిడ్ కంపెనీ ఇదేనా ?

జం. మం : ఇదే ఇదే, ఏం కావాలి తమకు ?

పె.మ : మీ ప్రాస్పెక్టస్ ఏమిటండీ ?

భీముడు : అయ్యగారు బైటి కెళ్ళారండి, రాగానే చెప్తారు.

జంత : మాకు తెలుసండి. మేము ఈ కంపెనీ తాలూకు జంటిల్మెనుగారూ, మాది చాలా గొప్ప కంపెనీలెండి.

మంత : అన్ని కంట్రీల్లో ఇన్‌కార్పొరేట్ చేశామండీ.

జంత : లండన్ హెడ్ క్వార్టర్సు.

మంత : కాదు బెర్లిన్.

జంత : కాదు లండన్.

పె.మ : ఏద్దై తేనేం అసలు సంగతి చెప్పండి.

మంత : ఏమండీ, అసలుసంగతి ఇవాళ డబ్బుకడితే వారంలో డబుల్ ఇచ్చేస్తాం.

పె.మ : అదెట్లా ఇస్తారయ్యా ?

జంత : ఆ కిటుకు చెబితే మా కంపెనీ ఎందుకూ? మీరే కంపెనీ పెట్టరూ ?

పె.మ : ఏద్దైనా రూపాయల మినహనుందా ఏంటి మీ దగ్గర?

మంత : ఎవరయ్యో నీవు నీ కిష్టవుంటే డబ్బుకట్టు. వారానికి మళ్ళీ వచ్చి డబుల్ డబ్బు తీసుకో.

జంత : ఇష్టం లేకపోతే వచ్చిన దోవనే వెళ్ళు.

పె.మ : ఎంత కట్టాలి ?

జంత : నీ దగ్గర ఎంతవుంటే అంతకట్టు.

పె.మ : నా దగ్గర ఐదే వున్నాయి?

మంత : కట్టేయ్ అంతే.

పె.మ : (ఐదు రూ. నోటు ఇస్తాడు) రసీదివ్వండి.

జంత : రసీదెందుకూ? జ్ఞాపకముంటుందిలే.

పె.మ : ఇదేంటి? రసీదివ్వండి.

మంత : ఇస్తాం వుండవయ్యా. అంత అపనమ్మకమైతే (రసీదిస్తాడు) వెళ్ళు (పెద్దమనిషి వెళ్ళిపోతాడు)

జంత : వట్టి పిచ్చివాడులా వున్నాడు. రశీదివ్వమంటాడేవిటి? రశీదుమీద ఎవరి సంతకం పెట్టావురా?

మంత : నీ సంతకం పెట్టా.

జంత : చచ్చానురా. వారానికొచ్చి దయ్యంలా పట్టుకుంటాడు.

మంత : భయపడకు, వాడి రశీదుమీద వాడి సంతకమే పెట్టేశా. చూచుకోకుండా జేబులో పెట్టేశాడు.

జంత : వాడిపేరు నీకెలా తెలుసురా?

మంత : వెంకటరావు కదురా? ఈ ఊళ్ళో అసలు ప్రాక్టీసు లేని ప్లీడరు వీడొక్కడే. చెట్టుకింద నిల్చుని ఆకులతో ఆర్గ్యూ చేస్తుంటాడు.

జంత : ఫూల్‌లా వున్నాడు.

మంత : ఇడియట్‌లా వున్నాడు.

జంత : కాదు ఫూల్‌లా వున్నాడు.

మంత : కాదు ఇడియట్‌లా వున్నాడు.

భీముడు : సైలెన్సు. (కారు హారన్ శబ్దం) అయ్యగారు వస్తున్నారు.

(రజని ప్రవేశిస్తాడు)

జంత : గుడ్‌మార్నింగు మాస్టర్జీ.

రజని : మీ రెందుకు వచ్చారురా ఇక్కడికి? వెళ్ళండి. ఒరే భీముడూ ఈ బదుద్దాయిల్ని ఎందుకు రానిచ్చావురా?

భీముడు : వెళ్ళమంటే వినలేదు దొరా? తమకి కుడిభుజం, ఎడమ భుజం వీళ్ళేట.

రజని : వెడిశారు వెధవలు. భీముడూ కొంచెం అమృతం తెప్పించు. (భీముడు డ్రింకు తెస్తాడు. రజని తాగుతాడు.)

జంత : ఊళ్ళో విశేషాలు నీ చెవిని వేసిపోదామని వచ్చాం మాస్టర్జీ.

మంత : అంతే మాస్టర్జీ.

రజని : ఏమిట్రా ఊళ్ళో విశేషాలేమిటి?

జంత : ఊరు ఊడికిపోతుంది మాస్టర్జీ.

మంత : పెసరట్లలే ఉడికిపోతుంది మాష్టర్జీ.

జంత : కాదు. మినపట్లలె ఉడికిపోతుంది.

రజని : ఎందుకురా?

జంత : మనం రూపాయల ఫ్యాక్టరీ పెడుతున్నామని.

మంత : ఇహ లోకంలో కరువుండదనుకొంటున్నారు మాస్టర్జీ.

జంత : మనీ మేక్స్ మెనీ థింక్స్. వుయ్ మేక్ మనీ.

మంత : సో, వుయ్ మేక్ మెనీ థింగ్స్ అనుకుంటున్నారు మాస్టర్జీ.

రజని : ఎవర్రా?

జంత : హోల్ వరల్డ్ మో తెక్కింది మాస్టర్జీ!

రజని : ఈడియట్స్, ఎవడు చెప్పాడ్రా రూపాయల ఫ్యాక్టరీ పెడుతున్నారని? నేను రూపాయల ఫ్యాక్టరీ పెడుతున్నానని దుష్ప్రచారం చేస్తున్నార్రా రాస్కెల్స్. ఇట్టాంటి వాగుడు వాగారంటే డొక్క చీల్చేస్తాను.

మంత : ఇహ వాగం మాష్టర్జీ. పబ్లిసిటీ అవసరమని ముందుగా కొంత వాగాం.

జంత : అప్పులాళ్ళు ఈగల్లా ముసురుతుంటే, రూపాయల ఫ్యాక్టరీ తయారుకానివ్వండోయ్, అంతా సాఫీ చేస్తాం, అని తోలేశాం మాష్టర్జీ.

రజని : షటప్, ఇడియట్స్. మీరు అప్పులు చెయ్యడమూ, నేను తీర్చడమూ.

జంత : అప్పులు చెయ్యక మరేం చెయ్యం మాస్టర్జీ. మన మార్కెట్ డౌన్ అయింది.

మంత : పూర్వం ఏ వెధవ జేబు కత్తిరించినా నోట్‌లు లొడ లొడ రాలేవి.

జంత : ఇప్పుడే వెధవ జేబు కొట్టినా మన కత్తెర దండుగ తప్ప వాడి జేబు దండుగ కనిపించడంలా.

రజని : ఈ మధ్య ఎన్ని జేబులు కొట్టార్రా?

మంత : మరీ మార్కెట్ పైటయింది మాస్టర్జీ. మొన్నో ఫూల్ జేబుకొడితే పావులాకానీ దొరికింది! జాలేసి వాణ్ని వెనక్కి పిలిచి బ్రదర్ జేబుకుచిల్లి కుట్టించుకో. అని చెప్పి పావలా వాపసు చేశాను.

జంత : వెధవ పావలా.

మంత : పావలా అంటే ఏమండోయ్ పదహారు కాన్లేగా. పట్టుమని పది సిగరెట్లు రావు.

జంత : పదహారు కాన్లుగావు 48 దమ్మిడీలు.

మంత : నాన్సెన్సు. పదహారుకాన్లు.

జంత : నాన్సెన్సు. 48 దమ్మిడీలు.

రజని : షటప్. ఇడియట్. ఒరేయ్ భీముడూ వీళ్ళని బయటికి గెంటేయ్.

మంత : ఉండు మాస్టర్జీ, ఒక్కసారి మన ఇంజనీరు సాబును నీ శిష్య పరిమాణులకు చూపించి గెంటేయ్.

రజని : (భీముడితో) యింజనీరుగారు ఏం చేస్తున్నారా?

భీముడు : మేడమీద కూచుని చదువుకుంటున్నారు దొరా.

రజని : వెళ్ళి పిలు. (భీముడు పోతాడు)(రజని టేబిల్ దగ్గరకు వెళ్ళి కొంచెం తాగుతాడు)

మంత : ఆ గ్లాసులోది ఏంటి మాస్టర్జి.

రజని : అమృతం. చుక్కపడిందంటే చిక్కులన్నీ తీరుతయ్.

మంత : మాకో చుక్క పడేద్దూ?

జంత : ఏం నీకు చిక్కులున్నాయీ?

మంత : యిటీవల మనవైఫ్ మహాచిక్కులు పెట్టేస్తుందోయ్. క్లబ్బు చందాలు, పిక్చర్ ప్రోగ్రాం, జార్జెట్ సారీలు. ఏమిటో నా ప్రాణం తీసేస్తోంది. ఒకరోజు నన్ను ఫూల్ అనేసింది.

జంత : ఉన్నమాటంది. తప్పేమిటి?

మంత : అంతేలే. ఫూల్ను కాకపోతే నీ హాస్బెండ్ ఎందు కవుతా నన్నా.

రజని : రైట్ రైట్... (శేఖర్ ప్రవేశం చేతిలోపుస్తకంతో)

రజని : (శేఖర్ని కిందామీదా చూచి) గ్రాండ్. అరే మంతర్ అయ్యగారు ఎల్లా ఉన్నారురా?

మంత : ఇంద్రుడల్లే వున్నారు.

జంత : దేవేంద్రుడల్లే వున్నారు.

మంత : నో, నో, మహేంద్రుడల్లే వున్నారు.

రజని : ఉష్... ఏం బ్రదర్ ఒక అహల్యను సప్లయిచేయించ మంటావా?

మంత : ఇంద్రుడల్లే రొమాన్సు చెయ్యొచ్చు.

శేఖర్ : ఉన్న పెళ్ళాలతో వేగలేక చస్తుంటే ఈ ఎక్స్ట్రా పెళ్ళాలతో ఎక్కడ చస్తాం. బ్రదర్ ఏదో ఎట్లాగో బ్రతకనీ నన్ను.

రజని : లైఫంటే ఒక్కరొమాన్సయినా ఉండాలి బ్రదర్. అస్తమానం ఇంటికూడేనా? అప్పుడప్పుడూ హోటల్ విందు తగలాలి. గాలిమార్పులాగ అవిమార్పుకూడఅవసరం.

శేఖర్ : నన్నిలా బ్రతకనీ. స్త్రీలంటే నా కసహ్యం.

మంతర్ : మంచిమాట చెప్పారు. నా హృదయంలో ఉన్నది తమరే సెలవిచ్చారు.

రజని : పెళ్ళాడేవరకు ప్రేమిస్తారు. పెళ్ళాడగానే బాధిస్తారు. అంతేనా ?

జంతర్ : అంతే, అంతే మాస్టర్జీ. మన మంతర్ గాడికి పెళ్ళి విషయంలో చాలా అనుభవం ఉంది.

రజని : (మంతర్ జంతర్లతో) ఇహ వెళ్ళండి మీరు. మాకు చాలా పనులున్నై.

మంతర్ : ఐతే మాస్టర్జీ రూపాయల మిషన్ ఎప్పుడయ్యేట్టు?

రజని : షటప్. ఆ కూత ఎక్కడైనా కూశారంటే డొక్క చీల్చేస్తాను.

మంతర్ : అబ్బే అంత పనా? వస్తాం మాస్టర్జీ.

జంతర్ : శలవ్, ఇంజనీర్ సాబ్ ...(వెళ్ళిపోతాడు.)

రజని : (శేఖర్ తో) ఏమిటి బ్రదర్. మళ్ళీమూడ్ లో పడ్డట్టున్నావ్. ఏమిటీ గ్రంథం. (శేఖర్ చేతిలోని పుస్తకం తీసుకుంటాడు) హామ్లెట్. అచ్ఛా! ఈ హామ్లెట్ గాడు ఇంకా నిన్నొదల్లేదన్నమాట. (పుస్తకం తెరచి చదువు

తాడు) ఈ హామ్లెట్‌గాడు ఆలోచించాలోచించి ఆఖరికి ఆరుగురిని చంపాడు. మీ కవిగాళ్ళందరూ ఇంతే.

శేఖర్ : నాకూ ఒకోక్కసారి అలాగే అనిపిస్తుంది. నీరో చక్రవర్తి రోమ్‌ను దహించినట్టు ప్రపంచాన్నంతా దహించి, ఏకాంతంగా విశ్రాంతి తీసుకుందామనిపిస్తుంది.

రజని : అనిపించి, అనిపించి, అరకప్పు కాఫీ త్రాగి ఆఖరుకు నిద్రపోతావ్, అంతేనా?

శేఖ : రజని, నేనిక్కడ ఒక్క నిమిషమైనా నిలువలేను. ఏదైన దూరదేశం వెళ్ళిపోతాను. పూర్వం నా భార్యా బిడ్డలతో గుడిసెలో పడున్నా సుఖంగా ఉండేది. ఈ కార్లు, ఈ బంగళాలు, ఈ వేషాలు నాకు అసహ్యంవేస్తోంది. ఈ దొంగ కంపెనీలు, ఈ దొంగ వేషాలు నా చేత కాదు అనుక్షణం నా అంతరాత్మ నన్ను దహిస్తోంది.

రజని : (బిగ్గరగా) అంతరాత్మ, బ్రదర్. ఇంకా అంతరాత్మ ఉందా నీకు.

శేఖర్ : అదొక్కటే మిగిలింది. అన్నీ నశించాయి. అదీ నశిస్తే......

రజని : దాని సంగతి నాకు చెప్పకు బ్రదర్. అంతరాత్మమంట కంటే ఆకలిమంట గొప్పది బ్రదర్. నీవు వెళ్ళిపోవడానికి నాఅభ్యంతరంలేదు. కాని ఆలోచించుకో, మళ్ళీ పస్తులు, బాకీలు, చిరిగిన చొక్కాలు, భార్యతో పోట్లాట, ఆకలి అన్నీ నీకోసం వేచివున్నాయి.

శేఖర్ : రజని నన్ను వెళ్ళనీ. అప్పుడే వూళ్ళో నలుగురూ మనల్ని గురించి నానావిధాలా చెప్పుకుంటున్నారు. పోలీసులకు తెలిస్తే ?

రజని : వాళ్ళసంగతినాకొదిలిపెట్టు. వాళ్లుమనకుక్లోజ్ ఫ్రెండ్సు.

శేఖర్ : ఈ పాడు బ్రతుక్కంటే ఆత్మహత్యే నయం.

రజని : అది అనుకున్నంత సులభంకాదు. (శేఖర్ తాగేందుకు గ్లాస్ ఇస్తాడు) బ్రదర్ కొంచెం అమృతం సేవించు.

శేఖర్ : అలవాటు లేదు.

రజని : చేసుకుంటే అదే అలవాటవుతుంది. ఒక్క చుక్కతో చిక్కులన్నీ తీరుతై. జెస్ట్ ఎ సిప్.

శేఖర్ : తాగుతాడు. (డోకు వచ్చినట్లుంటుంది)

రజని : తమాయించుకో. (శేఖర్ కుర్చీలో కూర్చుంటాడు)

రజని : ఎలా వుంది ?

శేఖర్ : అదోలావుంది.

రజని : (ఒక పువ్వు తీసుకుంటాడు) ఈ పువ్వుచూడు. ఎంత అందంగా ఉందో ?

శేఖర్ : ఇపుడే వికసించినట్లుంది.

రజని : సేట్‌జీకోసం కారు పంపాను. వచ్చేస్తుంటాడు. ఇవాళ మన మిషన్ తనిఖీ చేస్తాట్ట.

శేఖర్ : మైగాడ్ ... ...

రజని : యింకా మిషన్ కాలేదని చెప్పు.

శేఖర్ : ష్యూర్.

రజని : మరి కొంచెం తీర్థం సేవించు.

శేఖర్ : అచ్ఛా! ఏడీ సేట్‌జీ.

రజని : వచ్చేస్తుంటాడు. మిస్టర్ శేఖర్, సేట్‌జీ మంచివా డంటావా ? చెడ్డవా డంటావా ?

శేఖర్ : వెధవ పీనుగ, గాడ్ వట్టి ఫూల్ కాబట్టి వాడికంత డబ్బిచ్చాడు. మనకంత డబ్బుంటే వరల్డ్ తలక్రిందులు చేసేవాళ్ళం.

రజని: టాగోర్‌ను మించేవాడివి, హాలీవుడ్‌లో ఆవాగార్డెనర్‌ను బుక్ చేసి ప్రైజ్ పిక్చర్ తీసేవాడివికదూ ?

శేఖర్ : అన్నీ బాగుంటే మనముందు టాగూ రెంతోయ్ ?

రజని : ష్యూర్ ష్యూర్. అసలునీవు వీఫారిన్సులోనో ప్రిన్సుగా పుట్టాల్సిన రకం. ఈ వెధవ బ్యాక్‌వర్డ్ కంట్రీలో... అందులో ఈ ఆంధ్రా కంట్రీలో. ఛీ ఆంధ్రులు జీని యస్‌ని గుర్తించలేరోయ్.

శేఖర్ : ఎస్. యు ఆల్‌రైట్. (హారన్ శబ్దం వినిపిస్తుంది)

రజని : అదుగో సేట్‌జీ. (సేట్‌జీ వస్తాడు)

శేఖర్ : నమస్తే సేట్‌సాబ్.

సేటు : నమస్తే-నమస్తే. ఎండ ఎక్కువవుంది మాస్టర్జీ. మాదీ తల చిట్‌చిట్ పట్‌పట్ లాడింది.

రజని : జూన్ కదండి. (భీముడితో) ఒరేయ్‌భీముడూ! సేట్ సాబ్‌కు విసర్రా ఉక్క పోస్తుందట. (భీముడు విసురు తుంటాడు) అంతా కులాసా సేట్‌సాబ్.

సేటు : క్యా కులాసా మాస్టర్జీ. దునియా అంతా తల్‌కిందుల్ అవుతూ వుండాలి.

రజని : వరల్డ్‌వార్ వస్తోందట సేట్‌జీ.

సేటు : సచ్, రేడియో చెప్పాడ్ క్యా మాస్టర్జీ. మాదీ పంట పండుతాది.

రజని : యుద్ధం రావాలంటారు.

సేటు : ఓ!

రజని : మనుషులు చావాలంటారు.

సేటు : ఓ!

రజని : అచ్ఛా (మూలకుపోయి డ్రింకులు తెస్తాడు) కొంచెం అమృతం సేవించండి సేట్‌సాబ్ అలుపు తీరుతుంది.

సేటు : అమృతం క్యా అమృతం?

రజని : ప్యారిస్ మేక్. చుక్కపడిందంటే చిక్కులన్నీ తీరుతయ్. తమకోసం స్పెషల్‌గా తెప్పించాం.

సేటు : రుచి ఉండాది మాస్టర్జీ?

రజని : సేవించి చూడండి తమకే తెలుస్తుంది.

సేటు : అచ్ఛా. (తాగుతాడు) క్యా అమృతం మాస్టర్జీ, గొంతులో కాలువ త్తి టట్‌మని తన్నింది.

రజని : అది దాని స్వభావం లెండి. మరో చుక్కలో చల్లబడి పోతుంది.

సేటు : అచ్ఛా, ఫిర్ మాస్టర్జీ, మిషన్ తయార్ అయిందీ? అమెరికావాడు ఉత్తరం రాశాడ్? పనిముట్లు వచ్చాయ్? క్యా ఇంజనీర్ సాబ్?

శేఖర్ : ఓ తయారైంది. కాని ఇంకా మేన్ లివరు రాలేదు. న్యూయార్కుకు ఇవాళే టెలిగ్రాం ఇచ్చాం. ట్రాన్స ఫ్యూషన్ పార్ట్సుకోసం జర్మనీకి ఆర్డరు చేశాం. ఇంకా పదివేలు కావలసి వుంటుంది సేట్‌సాబ్.

సేటు : క్యా పదివేల్, నిన్న ఐదువేలు ఇచ్చాం. రోజూన వేల్ వేల్ ఎక్కడ తెస్తాం.

రజని : మరి మిషన్ ఊరికే వస్తుందా సేట్‌సాబ్. అమెరికన్ కంపెనీకి ఐదు వేలు అడ్వాన్సు పంపాలి. ఎస్టాబ్లిష్ మెంట్ ఎక్స్‌పెన్సెస్ ఐదు వేలు అవుతాయి.

సేటు : మా బాంక్ అకౌంట్ ఖాళీవుంది మాస్టర్జీ. కావలిస్తే వెయ్యి ఇస్తాం ఇప్పుడు వాడుకో...

రజని : వచ్చిన డబ్బంతా బంగారంగామార్చి పూడ్చి పెట్టేస్తే బ్యాంక్ అకౌంట్ ఖాళీగావుండక నిండుగా ఉంటుందా సేట్‌సాబ్.

సేటు : ఝూటాబాత్ మాస్టర్జీ. మాదీ ఇల్లు సోదా చేసుకో.

రజని : నిన్నటి ఆ లక్ష?

సేటు : క్యా లక్ష?

రజని : నిన్న నేను స్పెక్యులేషన్ ఆడి గెలిచిపెట్టిన లక్ష.

సేటు : క్యా బాత్ మాస్టర్జీ.

రజని : అసలు నాకా లక్షలో భాగంవుంది. మార్కెట్ జెంప్ చేస్తే సగం భాగం పంచుతానని మాటిచ్చారు. మా డబ్బు మాకు పడెయ్యండి. కంపెనీ మేమే నడుపు కుంటాం.

సేటు : క్యా మాస్టర్జీ మాకీ లడాయి చెయ్యడానికీ పిల్చావ్! పార్టీ చేస్తానన్నావ్. ఆఫీసర్లు వస్తారన్నావ్. ఒక్కడూ లేడూ?

రజని : 50 వేలకి చెక్ వ్రాయండి. లక్షపార్టీలు చేస్తాం, లక్ష మంది పెద్దమనుషులు వస్తారు.

సేటు : ధోకా ఇస్తున్నావ్ మాస్టర్‌జీ.

రజని : సేట్‌సాబ్, మీ మంచికీ మామంచికీ చెబుతున్నాను. వినండి. ఇప్పటికి 5 సంవత్సరాలనుంచి నాసలహాలతో బిజినెస్ చేస్తున్నారు. నేను మార్కెట్ పెరగాలంటే పెరిగేది. తరగాలంటే తరిగేది. మీకు లక్షలు గడించి పెట్టాను. నాకో 50 వేలు పడెయ్యడం మీకంత లెక్క లోది కాదు. (టేబుల్ దగ్గరకుపోయి తాగుతాడు)

సేటు : ఈబాత్ కట్టిపెట్టు. నాది నశీబ్ బాగుండి మేము గడించాం. ముందు మిషన్ చూపు. (లోపలికి పోవ డానికి ప్రయత్నిస్తాడు)

రజని : చెక్ రాసి వెళ్ళి మిషన్ చూచుకోండి.

సేటు : భాగ్‌నై గీగ్‌నై మాటమాటచేస్తే మేమూ పోలీసుకి రిపోర్టు (బయటికి పోవడానికి ప్రయత్నిస్తాడు)

రజని : ఆగు సేట్‌సాబ్? (దగ్గరకుపోయి భుజంపై చేయివేసి) సేట్‌సాబ్ వెధవ డబ్బుకోసం మనం స్నేహం చెడ గొట్టుకుంటామా? కూర్చోండి. (మూల టేబుల్‌నుండి డ్రింక్స్ తెస్తాడు) సేట్‌సాబ్ కొంచెం అమృతం సేవించండి.

సేటు : ఘాట్ ఉండాది మాస్టర్‌జీ.

రజని : ఎక్కించండి సేట్‌సాబ్. (భీముడితో) భీముడూ! టైమెంతయింది?

భీముడు : మూడున్నరైంది అయ్యగారూ.

రజని : ఇంజనీర్ సాబ్, ఇటీవల మన దేశంలో మరీ మర్డర్లు ఎక్కువైనాయి.

సేటు : మర్డర్- ఖూనీ?

శేఖర్ : లా అండ్ ఆర్డర్ తలక్రిందులైంది మాస్టర్జీ.

రజని : మొన్న పేపర్లో ఓ మర్డర్ కేసు చదివాను. మైగాడ్. మీరు చదివారా సేట్ సాబ్?

సేటు : చట్. మేమూ ఖూనీచూడం, చదువం, వినం. మేమూ బాపూజీ ఒకటి.

రజని : ష్యూర్ ష్యూర్. హింస పెట్టిస్తారుతప్ప-పెట్టరు. అది కొత్తటెక్నిక్. పోనీ వినండి సేట్ సాబ్. నేను బొంబాయి వెళ్ళినప్పుడే జరిగిందిలెండి హత్య. ఇంత వరకూ కోర్టుల్లోనే నానుతుంది.

సేటు. కిస్కు హత్యా చేశార్ మాస్టర్జీ.

రజని : (మూలకుపోయి తాగివస్తాడు) సేట్ చెమన్ లాల్ దౌలత్ రాం సుధీరాం అనే ఒక పెద్దమార్వాడీ వర్తకుణ్ని ఒక బజారు వెధవ ఖూనీ చేసాట్ట.

శేఖర్ : మైగాడ్.

సేటు : ఏ క్యా మాదీపేర్ వాడీపేర్ ఒకటి. మేమూ జిందా ఉన్నాం. వాడు మర్గయా కొట్టాడ్. ఏ క్యా దునియా మాష్టర్జీ.

శేఖర్ : ఇరనీ అంటే అదే సేట్ సాబ్.

రజని : ఇద్దరిపేర్లు ఒకటికాకూడదా సేట్‌సాబ్. మీ రిప్పుడు వెళ్ళి కోర్టులో హాజరవుతే ఆ హంతకుణ్ణి వదిలేస్తారు.

సేటు : మాకీ ఎందుకుమాస్టర్జీ. మాదీ ముఖ్ వాడికీ తెలీదు. వాడిదీ ముఖ్ మాకీ తెలీదు.

శేఖర్ : అసలు హత్య కారణమేమిటి మాస్టర్జీ.

రజని : పదిహేను సంవత్సరాల క్రితం ఆ సేట్‌కు ఒక పార్ట్‌నర్ ఉండేవాడట. అతనిపేరు రఘుపతి రావు.

సేటు : క్యా పార్ట్‌నర్, నాం రఘుపతిరావు? (భయపడ్డాడు)

రజని : మీకూ అలాంటి పార్ట్‌నర్ ఉన్నాడా సేట్‌సాబ్.

సేటు : నై. నై. మాకు మేమే సోల్ ప్రొప్రయిటర్.

రజని : అచ్ఛా (డ్రింకు ఇస్తూ) కొంచెం అమృతం సేవించండి. సేట్‌సాబ్.

శేఖర్ : ఆ తరువాత ఏం జరిగింది మాస్టర్జీ.

రజని : రెండు సంవత్సరాలు ఇద్దరూ కలిసి బిజినెస్ చేశారుట. ఆ తరువాత ఇద్దరికీ ఏదో పేచీలు వచ్చాయట. ఆ సేట్ దొంగ లెక్కల్లో, బ్లాక్‌మార్కెట్‌లో ఆ పార్ట్‌నర్ కలిసి రావడంలేదని వ్యాపారము దివాలా తీసిందని దొంగ లెక్కలుచూపి ఆ భాగస్తుణ్ని వెళ్ళగొట్టాడుట.

శేఖర్ : పాపం.

రజని : అంతేకాదు. అప్పు చూపించి, అతని ఇల్లు వేలం వేయించి తనే కొన్నాట్ట.

సేటు : సచ్, ఫిర్, మేమూ వెళ్ళివస్తాం మాస్టర్జీ. (పారిపోవ డానికి ప్రయత్నిస్తాడు)

రజని: కాస్త కథా వినిపోండి సేట్‌సాబ్. (తాగేందుకుఇస్తాడు) కొంచెం పుచ్చుకోండి.

సేటు: జల్దీ బోలో మాష్టర్జీ.

రజని : ఆ పార్ట్నర్ ఇల్లూవాకిలీ పోయి, ఊరి బయట పూరి పాకలో చేరాట్ట. మీరు ఎప్పుడైనా పూరిపాకలు చూశారా సేట్‌సాబ్.

సేటు : మేము మేడల్‌మే ఉంటాం.

శేఖర్ : ఔను మీకు పాకలతో ఏం పనిలెండి?

సేటు : ఫిర్ ఏం జరిగింది మాష్టర్జీ.

రజని : అతనికి ఇల్లూ వాకిలీ పోయింది,బిచ్చపు బ్రతుకైంది. భార్య, ఒక కొడుకు పదేళ్ళవాడు దరిద్రానికి తోడు అతనికి ఆరునెలలు తిరక్కుండానే పక్షవాతం వచ్చింది. పదినెలలు పక్షవాతంతో పస్తులతో పీక్కుని దిక్కు మాలిన చావు చచ్చాడు. భార్య వృద్ధురాలు. ఆ కొంపలో ఈ కొంపలో చాకిరీచేసి,ఆకుర్రాణ్ణి పోషించేది. నానాటికీ ఆమె శక్తి క్షీణించింది. ఒక సంవత్సరంతో క్షయతో మరణించింది. ఆ రోజు పూర్ణిమ. ఆ వెన్నెల్లో తల్లిశవాన్ని పెట్టుకుని ఆ రాత్రంతా కూర్చున్నాడా కుర్రాడు. చేతిలోదమ్మిడీలేదు. తండ్రి బ్రతికి వుండగా తండ్రితోకలసి సేట్‌దుకాణానికి వెళ్ళేవాడు.ఆరోజూ సేట్ దుకాణానికి వెళ్ళి, నేను ఫలానా వారి అబ్బాయిని. మా అమ్మ రాత్రి చనిపోయింది. శిల్లిపై సాతేసు. ఒక పదిరూపాయలు అప్పిప్పించ

మన్నాడు. ఆ సేట్ తెలీనట్లు నటించి కుర్రాణ్ణి కసిరి కొట్టి నెట్టించాడు. ఊరంతా అడుక్కుని తల్లి శవాన్ని దహించాడు. ఆ రాత్రే కట్టు బట్టలతో టికెట్ లేకుండా రైలెక్కి దేశంమీద వెళ్ళిపోయాడు.

శేఖర్ : పాపం.

సేటు : పాపం.

రజని : (తాగుతాడు) ఆ కుర్రాడు భలే కుర్రాడులెండి సేట్ సాబ్. వాడు తిరగని ఊరు, చెయ్యనిపాపం, చెప్పని అబద్ధం లేదట. టికెట్ లేకుండా మదరాసునుండిబొంబా యికి ఫరాకత్ గా ప్రయాణం చేసేవాడు. మొదట్లో ట్రావెలింగ్ ఇన్స్పెక్టర్లు చావమోదేవారు. తర్వాత దింపేసేవారు. తర్వాత నీవటోయ్! అని సిగరెట్టిచ్చి మర్యాద చేసేవారు. ప్లాట్‌ఫారం దొంగతనంలో పోలీ సులు చితకొట్టారు. తెరువాత వాడికి భాగస్థులు అయ్యారు.

సేటు : అచ్ఛా, అచ్ఛా......

రజని: దొంగలు,హోటలుబాయ్స్,రౌడీలు,డాఫర్లు, బ్రాకేట్ కంపెనీ ప్లేయర్సు వాడికి ఆప్త బంధువు లయ్యారు.

శేఖర్ : గ్రాండ్. చాలా అడ్వెంచరల్ కుర్రాడిలా వున్నాడు.

రజని : వాడు జీరో అంటే జీరో, ఫైవ్ అంటే ఫైవ్, నైన్ అంటే నైన్, గన్ షాట్ వాడు చెప్పిన నంబరొచ్చేది.

టేటు: బ్రతకడానికి ఒకొక్కడికి ఒకో విద్యఇస్తాడుభగవాన్.

రజని : వాడికీ బిజినెస్ మార్కెట్‌కూ సంబంధం ఏర్పడింది. పరువులేని దొంగల గుంపునుంచి, పరువుగల దొంగల గుంపుకు ప్రమోషన్ దొరికింది. మార్కెట్ వాడు పెరగాలంటే పెరిగేది, తరగాలంటే తరిగేది. పోలీసులు, మార్వాడీలూ, జూదర్లు,దొంగలు,పడుపుకత్తెలు గ్రూపు రాజకీయ నాయకులు... అందరికీ కింగ్ వాడు. పేరు మార్చాడు. ఊరుమార్చాడు. తీరుమార్చాడు. సభల్లో వాడే, సన్మానాల్లో వాడే, క్లబ్బుల్లో వాడే, కాన్ఫరెన్సుల్లో వాడే, ఎన్నికల్లో వాడే.

సేటు : గ్రాండ్ గ్రాండ్.

రజని : వాణ్ణి అదృష్టవంతుడన్నారు. అఖండుడన్నారు. మహా మేధావి అన్నారు. వాడిపేర నగర్ కట్టారు. ఇంకా ఏమన్నారో తెలుసా సేట్‌సాబ్.

సేటు : క్యా ?

రజని : మాస్టర్‌జీ అన్నారు.

సేటు : (భయంతో) మాస్టర్‌జీ.

రజని : సేట్‌సాబ్.

సేటు : మాస్టర్‌జీ..

రజని : కథ బాగుందా సేట్‌సాబ్.

సేటు : ఆ కుర్రాడు నీవు మాస్టర్‌జీ ?

రజని : సిద్ధంగా వున్నావా సేట్‌జీ.

సేటు : ఎందుకు మాస్టర్‌జీ ?

రజని : చచ్చిపోవడానికి.

సేటు : క్యా.

రజని : ఒరేయ్ భీముడూ. (భీముడువస్తాడు) వీణ్ణి తీసుకెళ్ళి చంపు. నానాచిత్రహింసలు పెట్టి చంపు. వీడి నెత్తురు విస్కీలో కలిపి పట్రా. వెళ్ళు నాకు దాహంగావుంది.

శేఖర్ : రజని,(శేఖర్, రజనికీ, సేటుకూ మధ్యగా పోతాడు) నీవు మనిషివా, రాక్షసుడివా?

రజని : పుట్టినప్పుడు-చచ్చేటప్పుడు అందరూ మనుషులే. మనుషులు కావడం కాకపోవడం మధ్యలోనే. శేఖర్ నీ కవిత్వాలు కట్టిపెట్టి వెళ్ళి నిద్రపో.

సేటు : మాకీ మర్డర్ చేస్తావ్? పోలీస్‌కీ ఫోన్ చేస్తాం. (ఫోను దగ్గరకు పోతాడు)

రజని : (రివాల్వర్ చూపుతూ) దించు ఫోన్. (సేటు దగ్గరికి పోయి కాలుకు పట్టుకుని) ప్రాణం అంటే తీపా సేట్ సాబ్. ఎందుకమ్మా తీపు? ఇడియట్ పద గదిలోకి. (భీముడితో) మొద్దల్లే చూస్తావేం రా లాగెయ్ లోపలికి. (భీముడు సేటుని లాగుతాడు)

సేటు : (అరుస్తాడు) రాం రాం...

రజని : (లోపలికి వెళ్ళుతాడు, దెబ్బలు కొడుతున్న శబ్దం. 1, 2, 3, 4, చితకొట్టి వస్తాడు) ఎంతటప్పురా ఆ వెధవను చంపడం. నేనే వస్తున్నాను! (లోపలికి పోతాడు) (రెండు గుండు దెబ్బల శబ్దం. తిరిగి గ్లాసుతో ప్రవేశం)

మిస్టర్ శేఖర్ ఇదిగో చూడు నెత్తురు. మనిషి నెత్తురు. దీనికోసం పది సంవత్సరాల తపస్సు చేశా. ఇంతతీయని పానీయం లోకంలో మరొకటి లేదు. (త్రాగుతాడు)

శేఖర్ : (బిగ్గరగా) యూ రోగ్ !

రజని : ఔను రోగ్‌నే. రోగ్ అఫ్ ది ఫస్ట్ వాటర్స్. రోగ్‌ను కాబట్టే బ్రతకగల్గాను. నీలాగ కవినై కూచుంటే ఎప్పుడో ఫైసలయ్యేవాణ్ని. ఖూనీలంటే మీ కవులకు భయం కదూ. ఖూనీలంటే మనకు మజా. ఖూనీ చేస్తుంటే గులాబిజామ్ నంజుతున్నట్టుంటుంది. (తాగుతాడు) (సేట్‌కేసి చూస్తూ) వెధవ పీనుగ చచ్చిపోయాడు. ఇప్పుడేం కట్టుకుపోయాడు? ఫ్రూర్ ఫెలో. ఇపుడు వాణ్ణి చూస్తే జాలేస్తుంది. ఛా. ఛా. నా తల్లిదండ్రుల్ని చంపాడు. నా జీవితం నాశనం చేశాడు. ఊ. (భీముడితో) ఒరేయ్ భీముడూ వెళ్ళి శేఖరయ్యగారి భార్యనూ, పిల్లాణ్ణీ తీసుకురా పో......

శేఖర్ : వద్దు ఈ ఖూనీల కొంపకు నా భార్యా పిల్లలూ...

రజని : రానివోయ్ చివరిసారి చూచిపోతారు.

శేఖర్ : (బిగ్గరగా) రజని...

రజని : వెళ్ళరా భీముడూ.

శేఖర్ : నేనూ వెడుతున్నా. (వెళ్ళబోతాడు)

రజని : (రివ్వాలర్ చూపిస్తూ) వెడితే నీవూ, సేట్‌జీని మీట్ కావలసి వుంటుంది. కూచో భాయిసాబ్. భయపడకు కూచో. (గ్లాసుఇస్తూ) కొంచెం అమృతం సేవిస్తారా?

శేఖర్ : అక్కర్లేదు తల తిరుగుతోంది.

రజని: మిస్టర్ శేఖర్ అందరూ నాముందు నన్ను మంచివాడని చాటుకెళ్ళి చెడ్డవాడంటారు. ఇదేమన్నా న్యాయమా?

శేఖర్ : మనుషులంతే. వాళ్ళకు క్షణానికో నాలుక.

రజని : బ్రదర్ నీవూ నేనూ స్నేహితులం అవునా కాదా?

శేఖర్ : కావచ్చు.

రజని : కావచ్చు కాదు అవునా కాదా?

శేఖర్ : అవును.

రజని : జీవితంలో నీకు నేను చాలా సహాయం చేశాను. అవునా కాదా?

శేఖర్ : అవును.

రజని : నీకు లక్షసార్లు డబ్బిచ్చాను. నీ అప్పులన్నీ తీర్చాను. నీకు సేట్‌జీచేత కావలసినంత డబ్బిప్పించాను. ప్రపంచంలో ఒక్కడూ నీ మొహం చూడనపుడు నేనాదుకున్నాను. అవునా కాదా?

శేఖర్ : అవును.

రజని : నీవు నాకు ఋణపడి ఉన్నావు అవునా కాదా?

శేఖర్ : అవును.

రజని: బ్రదర్ నీవు నాకు ఒకచిన్న సహాయం చేసిపెట్టాలోయ్.

శేఖర్ : ఓ తప్పకుండా చేస్తాను.

రజని : అది. శేఖర్‌ది అమృత హృదయం. శేఖర్ మాటంటే మాట. తప్పకుండా చేస్తావా?

శేఖర్ : మాటంటే మాట అంతే.

రజని : చెప్పనా?

శేఖర్ : తక్షణం.

రజని : ఆ హత్య నీవే చేశానని చెప్పి జైలు కెళ్ళాలి.

శేఖర్ : రజనీ...

రజని : తొందరపడకు. జైలు మీ కవులకు తగినచోటు. హాయిగా వుండొచ్చు. ఇష్టమొచ్చినన్ని పుస్తకాలు రాయొచ్చు. ఈ సంఘం గొడవ అసలేవుండదు. అది గాక నీవు బయటవుండి మాత్రం ఏం ఉపయోగం? నేను చెయ్యవలసిన మహాకార్యాలు చాలా వున్నాయి.

శేఖర్ : రజని...

రజని : మాటంటే మాట అంతే. బ్రదర్ భార్యనూపిల్లల్నూ వదలి వెళ్ళాలంటే కష్టంగావుందా? నీకు నీ భార్యంటే ప్రేమేనా ?

శేఖర్ : ఛీ దాన్ని చూస్తే నా కసహ్యం. నేను దరిద్రంతో చచ్చినంతకాలం నా ఉసురుపోసుకుంది. ఇప్పుడు మిడి మాలపు సిరి పట్టేందని వెధవ ప్రేమ నటిస్తూంది.

రజని : మరెంక అలాంటి భార్యతో ఏం సుఖపడతావ్. ఒక వేళ నేను జైలుకెళ్ళి నా నిన్ను ఇన్వాల్వ్ చేస్తారు. నీవే వెళ్ళడం మంచింది. నీవు తిరిగి వచ్చేవరకూ నీ సంసార క్షేమం నేను చూస్తాలే. (నిశ్శబ్దం)

శేఖర్ : సరే వెడతాను. అక్కడే హాయిగావుంటాను. అక్కడైనా రవంత విశ్రాంతి దొరుకుతుందేమో?(పిల్లవాడు పరుగెత్తుకొస్తాడు)

బాబు : నాన్నా...

శేఖర్ : నాన్నా... అమ్మ వచ్చిందా... (శారద వస్తుంది) శారదా! నీ వెందు కొచ్చావ్.

శారద : నేను మొదటినుంచీ చెబుతున్నాను ఈ పాడు స్నేహాలు పట్టొద్దని. ఏం జరిగింది చెప్పండి.

రజని : ఏం జరుగుతుంది హత్య జరిగింది.

శారద : హత్య ఎవరు చేశారు?

రజని : ఎవరు చేస్తారేం ? నీ భర్తే చేశాడు.

శారద : నేను నమ్మను. (శేఖర్‌తో) చెప్పండి నిజంగా మీరే చేశారా? చెప్పండి.

శేఖర్ : ఆ, నేనే చేశాను.

శారదా : అబద్ధం. (రజనితో) నీవు వట్టి మోసగాడివి. నీవే హత్యచేసి నా భర్తమీద పెట్టావ్.

శేఖర్ : ఊరుకో శారదా నీవు ఇంటికి వెళ్ళు.

శారద : రండి. నాతో మా పుట్టింటికి వెడదాం. మా నాన్నతో చెప్పి ఈ మోసగాణ్ని...

రజని: శారదా నేను మోసగాణ్ని... మోసగాణ్ని కాబట్టే మీ అప్పులన్నీ తీర్చి మీ సంసారం నిలబెట్టింది. ఈ బంగళాలు, కార్లు, సేవకులు, జార్జెట్ సిల్కులూ, ఎలా వచ్చాయో గ్రహించి మాట్లాడు. అదివరకు సత్రంలో పస్తులు పడుకున్న రోజులు జ్ఞాపకం ఉంచుకొని మాట్లాడు. నాన్నట నాన్న. ఇదివరకల్లా మీ నాన్న ఏమైనాడు ? ఇపుడు కాస్త వెలుగుతూంటే "అమ్మాయి శారదా" అని నిన్ను దువ్వి ఉంటాడు.

శారద : మహా ఉద్ధరించావ్. నా భర్తను మోసగించి నా సంసారాన్ని పొట్టన పెట్టుకున్నావ్. వెధవడబ్బు.

రజని : ఆ వెధవ డబ్బుకోసమే భర్తను అహర్నిశలు హింసించావు.

శారద : నోరుముయ్.

శేఖర్ : నీవు అనవసరపు రాదన పెట్టుకోక వెళ్ళు శారదా.

(ఇనస్పెక్టరు పోలీసుతో ప్రవేశం)

రజని : కమిన్ ఇన్ స్పెక్టరుసాబ్.

ఇనస్పెక్టరు : మాస్టర్జీ, ఏదో హత్య జరిగిందట.

రజని : అవునండి. మా శేఖర్. ఏదో కుర్రతనం. ఆ చెమన్ లాల్ సేటుగాడిని వుద్రేకంలో హత్యచేశాడు.

ఇనస్పెక్టరు : వాట్ మిస్టర్ శేఖర్ ?

శేఖర్ : అవును.

శారద : అంతా అబద్ధం ఇనస్పెక్టరుగారూ. ఈ రజనే హత్య చేశాడు.

రజని : ఆమె కొంచెం నర్వెస్‌గా వుందిలెండి, మిస్టర్ ఇనస్పెక్టర్.

శేఖర్ : పదండి ఇనస్పెక్టర్. నేనే హత్యచేశాను.

శారద : ఆయనమాట నమ్మకండి. ఆయనకు పిచ్చెత్తింది. ఈ మోసగాడు తాగించి చెప్పిస్తున్నాడు.

ఇనస్పెక్టరు : అన్నీ స్టేషన్లో విచారిద్దాం. ఏయ్ 404 ఇతన్ని తీసికెళ్ళు.

శారద : ఆగండి.

బాబు : నాన్నా...

రజని : శారదా ఆగు. (ఆమె వెనక్కి వస్తుంది. రజని కుర్చీలో కూలబడతాడు).

శారద : (రజనివైపు చూస్తూ) రజని నిజం చెప్పు. నా సంసారంలో చిచ్చుపెట్టకు. మమ్మల్ని నాశనంచేసి నువ్వేం సుఖపడతావు. ఈ బిడ్డను చూచైనా నీ స్నేహితుణ్ని కరుణించు. (వంగి పాదాలు పట్టుకుంటుంది) రజని— రజని—

శేఖర్: శారదా ఇలారా. మిస్టర్ రజని నీవు నాకు చేసిన సహాయానికి, నేనూ నా కుటుంబం సర్వదా కృతజ్ఞులం. కాని ఒక్క విషయం. నిన్ను నీ తల్లి కన్నట్టుగానే ఇది మా బాబును కన్నది. నీలాగా ఒక్క ప్రతీకారంకోసం తన జన్మనంతా నాశనం చేసుకోమని మా బాబుని నేను కోరను. చివరికి దిక్కుమాలిన చావు చచ్చినాసరే.

శెలవ్.

( తెర )

# నాలుగవ రంగం

(Sounds — Order — Order)

(పగలు - 12 గంటల సమయం కోర్టు జడ్జిమెంటు విన బడుతుంది. జూన్ 16వ తారీఖు సాయంత్రం 6 గంటలకు సేట్ చమన్‌లాల్ అనే ప్రసిద్ధమార్వాడీ వర్తకుణ్ని శేఖర్ అనే యువకుడు ధనాశ చేత చంపినందుకుగాను ద్వీపాంతరవాసశిక్ష)

(రజని ప్రవేశం)

(రజని బిగ్గరగా) ఆపండి శిక్ష. (పాస్) మైలార్డ్ అండ్ జెంటిల్‌మెన్ ఆఫ్ ది జ్యూరీ. చమన్‌లాల్ సుధీరాం కరం చంద్ సేట్ అనే ప్రసిద్ధ వర్తకుణ్ని జూన్ 16 వ తారీఖు సా॥ 6 గంటలకు హత్యచేసింది శేఖర్ కాదు, నేను. ఇదిగో రివాల్వ రుతో చంపాను. (విసరాడు)

నేను చంపుతున్నప్పుడు ఈ శేఖర్, భీముడూవున్నారు. కాబట్టి ఈ స్థానంలో నిల్చుని శిక్ష స్వీకరించవలసింది నేను మైలార్డ్ ………!

ఈ శిక్ష స్వీకరించి ద్వీపాంతరం వెళ్ళబోయేముందు తమకొక చిన్న మనవిచేస్తాను. కోర్టురికార్డులలో ఒకసారైనా అర్థంవున్న ముక్కలు నాలుగు పడివుండాలంటే ఈ వాక్యాలు వ్రాసుకోండి.

మైలార్డ్ ………!

ఈరోజు నేనే నేరం వొప్పుకుని మీ ముందుకు వస్తే నన్ను శిక్షిస్తున్నారు. నేను పది సంవత్సరాలు పచ్చిమోసం

చేశాను. లక్ష వేషాలువేశాను. లక్ష మోసాలు చేశాను. ప్రాణాలతో చదరంగంఆడాను.బహిరంగంగా బ్లాక్ మార్కెటు చేశాను. లంచాలు విసిరేశాను. ఎగ్జిబిషన్లనీ, క్లబ్బులనీ పెట్టి జూదాన్ని, వ్యభిచారాన్ని ఓపెన్ గా నడిపించాను. సేట్లను, జూదర్లను, సి. డి.లను గులాములచేశాను. శిక్ష విధించారా నాకు?... ...మాట్లాడరేం?

నాకు పార్టీలిచ్చారు. నన్ను మాష్టర్జీ అని అందరూ నా స్నేహంకోసం పోటీపడ్డారు. నన్ను ప్లానింగ్ జీనియస్ అన్నారు.

ఇప్పుడు మీరొక హంతకుణ్ణి విచారిస్తున్నారు.మంచిదే. సంఘానికి ఒక మనిషి అపకారం చెయ్యడం దోషమే. నేను కాదనను. కాని మనిషిని సంఘం ద్రోహంచేస్తే? (పాజ్) మాట్లాడరేం? ఈ ప్రశ్నకు సమాధానంచెప్పేవరకూ ఏకోర్టుకూ ఏ మనిషినీ విచారించే హక్కు లేదు.

మైలార్డ్... ... ...

ఇప్పుడు నాకు 30 సంవత్సరాలు. పది సంవత్సరాల వరకూ పూవులా బ్రతికాను ఈసేట్ నా బ్రతుకులో నిప్పులు పోశాడు. అప్పుడు ఈ మనుష్యులందరూ ఏంచేశారు? రాబందులా నన్ను చుట్టుముట్టారు. నాఅంతరాత్మని పీక్కుతిన్నారు.

నా తల్లి శవాన్ని దహించడానికి పైసా లేక నేను అడుక్కొన్నరాత్రి ఈకోర్టులన్నీ ఏమైనై?...ఈ లా అండ్ ఆర్డర్ ఎక్కడుంది? ఈ సాంఘిక భద్రత ఏం చేస్తోంది? ఆ రోజున న్యాయం అవసరంలేని సంఘానికి, ఈ రోజు నన్ను శిక్షించే హక్కెవ్వరిచ్చారు? నాకు సంఘం సర్వాపచారాలు చేసింది.

సంఘం నన్ను కట్టిన యమపాశాలతో నేనే సంఘాన్ని కట్టే శాను. మనుష్యుల జీవితాలతో ఫుట్‌బాల్ ఆడాను. శిక్ష విధించారా నాకు?

రెండుముఖాలతో బ్రతికాను. రెండు నాలుకలతో మాట్లాడాను. రెండు జీవితాలు గడిపాను. సంఘాన్ని సర్కసు చేయించాను.

మైలార్డ్ ... ... ...

జ్ఞాపకం వుంచుకోండి. ఈసంఘం నరకం. ఈసంఘంలో మనిషి దేవతగా బ్రతకడం అసాధ్యం. బ్రతకాలంటే మనిషి రాక్షసి కావాలి. అన్యాయం చెయ్యాలి. అక్రమంచెయ్యాలి. అబద్ధం ఆడాలి. ఇదే న్యాయం ఈరోజు. నేనూ అదేచేశాను. ఈ నరకానికి ప్రతినిధిని నేను.

మైలార్డ్ ... ... ...

ఈనరకానికి అంతిమక్షణాలు సమీపించాయి. న్యాయానికీ ధర్మానికీ ఈఅర్థం ఇక చలామణీకాదు. మనిషిమరోరూపం ధరిస్తాడు. మనిషినీ, మనిషినీ విడదీసి మనిషిని పశువుగా మార్చే డబ్బు గోడల పునాదులు పెకలింపబడతాయి. అప్పుడు మీరు శిక్షించవలసిన అవసరం నేను శిక్షింపబడవలసిన అవసరం వుండదు.

మైలార్డ్ ... ... ...

ఈ శేఖర్, ఈ సంఘపు రథచక్రాల క్రింద నలిగిపోయాడు. నేనీ రథంలో స్వారీచేశాను. భవిష్యత్తులో నేనూ వుండను. ఈ శేఖర్ వుండడు. (బాబుని దగ్గరకు తీసుకుంటాడు)

ఈకుర్రాడు భావిని పరిపాలిస్తాడు. మైలార్డ్... ఇక వెడతాను. ఎక్కడికైనా సరే మీ ఇష్టంవచ్చిన ద్వీపానికి పంపండి. ఈ మనుష్యులకూ ఈసంఘానికీ ఈజీవితానికి దూరంగా విశ్రాంతి తీసుకుంటాను. ఇకచాలు. థ్యాంక్స్...

మిష్టర్ శేఖర్ ఇది తీసుకో! నా ఆస్తి నీ కొడుకుపేర వ్రాశాను. (వీలునామా చేతికి ఇస్తాడు) వస్తానుమరి డోంట్ వరీ...(చిరునవ్వు) (పోలీసులతో వెళ్ళిపోతాడు.)

( తెర )

